H.P. Narsing Rao

# సవారి



కొడవటిగంటి
కుటుంబరావు

నవోదయ పబ్లిషర్సు
ఏలూరు రోడ్ విజయవాడ 2

# ఉపోద్ఘాతం

అందవిహీనతవల్ల ఏర్పడే సమస్య అచ్చగా సాంఘికసమస్య కాదు. వ్యక్తిగతమైన సమస్యా కాదు. మతవ్యవస్థలో—అంటే మతాచారాలు వివాహాన్ని చూపించే సమాజంలో—అందవిహీనతవల్ల పెళ్ళి కాకుండాపోయిన స్త్రీలు లేరు. 'గంతకుతగిన బొంత' అనో, 'కులమింటి కోతి నయం' అనో మనసును సరిపుచ్చుకుని అంద రాడపిల్లలకి ఏదోవిధంగా మూడుముళ్ళూ వేసేవారు. నా చిన్నతనంలోకూడా పెళ్ళిళ్ళు మతాచారాల ననుసరించే జరిగాయి. వాటిలో వ్యక్తివాంఛలకూ, వ్యక్తి నిర్ణయాలకూ లాంఛనప్రాయమైన స్థానంమటుకే వుండేది. అందుచేత అప్పటికి అందవిహీనత వ్యక్తిసమస్యగా ఏమంత బాధించలేదు. ఎక్కడా సంబంధం దొరక్కపోతే మేనరికం ముడిపెట్టి 'నాతి చరామి' అనిపించేస్తారు. (జీవితంమాట ఏమోగాని సినిమా కథలలో యీ మేనరికాలకు మోజు చాలా వున్నది)

జామీందారీ సంస్కృతిలోకూడా వివాహానికి 'వ్యక్తిత్వం' లేదు. ఏ అంతస్థు కా అంతస్థు పెళ్ళాడాలి. అది నియమం—కాకపోతే 'నాతి చరామి' అన్నదానికి పట్టింపులేదు. అసలది కాకపోయినా మగవాడు అతి చరించవచ్చు. భార్యమీద ఎంతమంది వుంపుడుకత్తెలుంటే అంత గొప్ప. అందగత్తెలకు మంచికాలం. కాని, అందవిహీనులకు పూర్తిగా చెడ్డకాలంకాదు.

బూర్జువా సంస్కృతితోనే అందవిహీనత ఒక సమస్య అయింది. పితృదేవతలు అఘోరిస్తారని మగవాణ్ణి భయపెట్టి ఎవతె మెడలోనో మూడుముళ్లూ వేయించటానికి లేదు. తన కిష్టమైనదాన్ని కులగోత్రాలు కూడా పాటించకుండా చేసుకుంటానంటాడు—లేదా, పిల్లైనంత పెద్ద కట్నానికి అమ్ముడైనా పోతానంటాడు. బూర్జువాసమాజంలో కోటీశ్వరులు అతిగత్తెలను పెళ్ళాడటమూ, పదహారేళ్ళ యువకులు అరవైఏళ్ళ సంపన్న వితంతువులను పెళ్ళాడటమూ కూడా జరిగింది.

విప్లవ సమాజంలో ఈ సమస్య ఏమయింది? ఎక్కడనో ఎహ్రెన్‌బర్గ్ చెప్పినట్లు, విప్లవం చేసిన తరంవారికి ప్రేమ సమస్య లేకపోయింది. తమతో విప్లవ కష్టాలు పంచుకొన్న ఆడ 'కామ్రేడ్' లను పెళ్ళాడారు. ప్రమాదవశాన పుంస్త్వం పోగొట్టుకున్న యువకులను ఆడ 'కామ్రేడ్'లు పెళ్ళాడిన సందర్భాలు కూడా ఉన్నాయట.

మన దేశంలో కూడా కొందరు కమ్యూనిస్టులు అందమూ, ప్రేమా అనేవి తమ జీవితాలకు సమస్యలు కాకుండా మసులుకున్నారు. అందచందాలు ఏ కోశానా లేని అనేకమంది స్త్రీ కమ్యూనిస్టులు భర్తలను సంపాదించుకున్నారు. గాంధీజీ నడిపిన సత్యాగ్రహోద్యమాల కాలంలోకూడా యిలాటి 'విప్లవ' వివాహాలు జరిగితే జరిగి వుండవచ్చు — అటువంటివి నా అనుభవంలోకి రాలేదు.

అసలు సంగతేమంటే ఉద్యమాలది తాత్కాలిక పరిస్థితి. అది ఎంతోకాలం నిలవదు. రష్యావంటి దేశాలలో తిరిగి అందవిహీనత ఒక సమస్య అయింది; మరింత తీవ్రసమస్య అయిందేమోకూడానూ! ఎందుకంటే ఎక్కడైనా ఒక కన్య ప్రేమకోసం కాకుండా, వయసు మళ్ళిన భర్తను హోదాకోసం పెళ్ళాడటం జరిగినప్పటికీ, సోషలిస్టు వ్యవస్థలో వివాహం పూర్తిగా వ్యక్తి సమస్య అవుతుంది. మేనరికాలూ, ఆనవాయితీలూ, కులగోత్రాలూ, అంతస్థులూ వుండవు; వీటికితోడు కట్నాలకోసం పెళ్ళాడటాలుకూడా లేకుండా పోతాయి. అందుచేత ప్రతి ఒక్క సోషలిస్టుపౌరుడు తాను ప్రేమించినదాన్ని, దాని ప్రేమ తాను పొందగలిగితే, పెళ్ళాడెయ్యవచ్చు. ఆ పరిస్థితిలో అందవిహీనతకు ఏం గతి? పైపెచ్చు అలాటి సమాజంలో అందవిహీనత స్త్రీ-పురుషులను యించుమించు సమంగానే బాధిస్తుంది......మన దేశం నుంచి కొందరు రష్యా వెళ్ళినప్పుడు అక్కడ ఒక ఆడడాక్టరును చూసి "నువ్వెందుకు పెళ్ళి చేసుకోలేదు?" అని అడిగితే 'నేను అందంగా ఉండను, నన్నెవరు చేసుకుంటారు?' అన్నదట.

అందవిహీనత అనేది అచ్చంగా సామాజిక సమస్యగాని, అచ్చగా వ్యక్తిగతమైన సమస్యగాని కాదని చూపటానికి యిదంతా చెప్పాను.

సాంఘిక పరిణామంయొక్క తొలిదశలలో లేని యీ సమస్య ఒక్కొక్క దశే గడిచినకొద్దీ వ్యక్తిగతమైన సమస్యగా రూపొంది పదునెక్కుతున్నది. ఏవిధంగానైనా అది ఒక సామాజిక సమస్య అనిపించుకోదు. ఎందుకంటే సమాజంలో ఒకవంతు అందవిహీనులు—స్త్రీలూ, పురుషులూ—ఉండితీరుతారు. వీరి ప్రేమ, వివాహసమస్యలు అందంపైననే ఆధారపడేపక్షంలో పెద్దచిక్కే వస్తుంది. ఆ చిక్కు ఎలా పరిష్కారమయ్యేటట్టూ ?

దీనికి ఆధ్యాత్మిక పరిష్కారం తప్పలేదేమో ననిపిస్తుంది. (ఆధ్యాత్మిక మంటే పరలోకానికి చెందినదని కాదు.) సామాజిక జీవితం భౌతికంగా సుప్రతిష్ఠితమయే కొద్దీ మానవుడి ఆధ్యాత్మికశక్తులు పెరిగితీరుతాయి. మనిషినుంచి మనిషిపొందే లక్షలాది అనుభూతులలో అందం ఇచ్చేది ఒక్కటి మాత్రమే, అంతకంటె గాఢమైన అనుభూతులు చాలా ఉంటాయి. తన తల్లి అందగత్తె అవునాకాదా, బొమ్మ అందగత్తె అవునా కాదా అన్న సంశయం పిల్లలను ఎన్నడూ బాధించదు. ఎత్తుకు పెంచిన పనివాళ్ళుకూడా మనని ఆజన్మాంతం అభిమానబంధంతో కట్టేసుకుంటారు. గాంధీ బొమ్మ ఒకనాడు, ఈనాడు జవహర్లాలు బొమ్మా, కనిపిస్తే ఎంతమంది హృదయాలు ఆనందంతో నిండేదీ మనం ఊహించవచ్చు.

ఇలాటి ఆధ్యాత్మిక బంధాలు జీవితంనిండా ఉంటాయి. స్త్రీ పురుషులమధ్య ఇప్పుడుండే గోడలు పడిపోయినాక అటువంటి అనుభూతులకు అవకాశాలు హెచ్చుతాయి. వాటికి విలువకూడా పెరుగుతుంది. ఆ అనుభూతుల ఫలితంగా ప్రేమా వివాహమూ సంభవం అవుతాయి.

ఈ మాట వ్యక్తం చెయ్యటానికే 'కురూపి' రాశాను. ఇందులో ముఖ్య పురుషపాత్ర ఒకవిధమైన వర్గభ్రష్టుడని చెప్పవచ్చు. ధనికులపై ఆధారపడ్డ ప్రాణి. స్వయంగా ధనికవర్గం వాడుకాడు. అందుచేత మధ్యతరగతి కింది అంతస్థు స్వభావాలూ, పై అంతస్థు భావాలూ కలగలసిన వ్యక్తి. ప్రేమ అంటే అతనికి సెక్స్ తప్ప మరొకటి కాదు.

ప్రధాన స్త్రీ పాత్ర అతని పాలిటి అంతరాత్మ లాటిదిగా ఉండాలని ఉద్దేశించాను. ఆ పాత్ర ఎంతవరకు ఫలించింది కథలో ప్రధాన పురుషపాత్ర (కనకం) ప్రవర్తనద్వారా చూపటానికి యత్నించాను. సరస్వతి ద్వారా కనకానికి నిజమైన ఆధ్యాత్మిక అనుభూతి కలిగినట్టు పాఠకులకు తోస్తే నా ప్రయత్నం విజయవంత మయినట్టే.

వా రిద్దరికీ పెళ్ళి జరగలేదు. తరవాతనైనా జరుగుతుందా? నాకు తెలీదు? కనకం తనకు సరస్వతిపైగల సానుభూతిని ప్రేమ కింద జమకట్టాడా? అది కూడా నాకు తెలీదు. వీటన్నిటినీ నేను అనుమాన రహితంగా చెప్పినట్టయితే అది ఆత్మవంచనా, పరవంచనా కావటమేగాక, వర్ధమాన జీవితాన్ని వంచించటమే అవుతుంది.

అంటే ఇది భవిష్యత్తుకు సంబంధించిన కథే అని కూడా నా ఉద్దేశం కాదు. అందచందాలు లేని భార్యలను ఆప్యాయంగా ప్రేమించే భర్తలున్నట్టు నాకు చిన్నతనంనుంచి కూడా తెలును. నాకు తెలియనిదల్లా నేటి మన సమాజం కిందకే దిగుతున్నదో, మీదికే ఎక్కుతున్నదో, నేటి యువకులు పైనే చూస్తున్నారో, కిందకే చూస్తున్నారో ... అది మాత్రమే.

— కొడవటిగంటి కుటుంబరావు.

9

# కురూపి

కనకం బస్సుకోసం ముళ్ళమీద నుంచున్నాడు. పట్నంలో బస్సుల కోసం ఇంకోవిధంగా నుంచోవటం సాధ్యంకాదు. తమిళ సోదర సోదరీ మణులు తపశ్శక్తి సంపన్నులు కావటంచేత గాబోలు ముళ్ళ మీద నుంచున్నా బాధపడరు. తెలుగువాడికా శక్తిలేదు. 'నువ్వెక్క దలుచుకున్న బస్సు ఒక జీవితకాలం లేటు' అని ఆరుద్ర అన్నముక్కను తన కనుకూలంగా మలుచుకున్నాడు కనకం. మంచి కవిత్వం పరిస్థితికి అనుకూలంగా మలుగుతుంది.

కనకానికి అవతల అర్జంటుపని వుందనికాదు. అతనికి చెయ్య దగిన పనులన్నీ ముఖ్యమైనవే. తన జీవితంలో ప్రతి క్షణమూ అవసర మైన పనుల క్రిందనే వినియోగ పడాలని అతని ఉద్దేశ్యం. రానిబస్సు కోసం కాచుకుని వుండటమూ, ఊకదంపుడు ఉపన్యాసాలు వినటమూ, క్రాపు చేయించుకోటానికి వెళ్ళి తన వంతుకోసం గంటల తరబడి వేచి వుండటమూ అతనికి ఆయుక్షీణమైన పనులనిపిస్తాయి.

కడుపుతోన్నమ్మ కనక మానదుగనక బస్సు రానేవచ్చింది. మామూలు ప్రకారం బస్సు కిటకిట లాడుతున్నది. ఎవరో శిక్ష విధించి నట్టుగా, నిలబడిన జనంలో ముప్పాతిక మంది వెనుక భాగంలోనే గడ్డకట్టుకు పోయారు. అక్కడ ఆడవాళ్ళ సీట్లుంటాయి. ఒక్కబస్సు లోనేకాదు. ఎక్కడ చూసినా సెక్సు యావ చాలా జాస్తి అయింది. ఇంక దేనికి లేకపోయినా సెక్సుకు స్వాతంత్ర్యం వచ్చిందని కనకం

ఒకసారి అంటే "కాదు: ఈ యూవకు కారణం సినిమాలు" అన్నా రెవరో. స్త్రీ పురుషుల మధ్య వుండే స్వాభావసిద్ధమైన పరస్పరాకర్షణకు సినిమాలేకాదు. కథలేకాదు. చాలావిషయాలు దోహదం చేస్తు న్నాయి.

"తప్పేమిటి?" అనుకున్నాడు కనకం. అవివాళ్ళ సీట్లదగ్గిర కరుడు గట్టిపోయిన జనాన్ని చూసి చీదరించుకుంటూనే, "ఈ దేశంలో వాళ్ళు చాలాకాలం సెక్స నేదిలేనట్లునటించారు. వాళ్ళ తరంలో ముప్ఫైయేళ్ళ మగవాడికిమూడేళ్ళపిల్లను పెళ్ళిచేసేవారనికనకంనాయనమ్మఅంటూం డేది. కుటుంబనియంత్రణం అయివుంటుంది. వాళ్ళనాయనమ్మ నలుగురు అప్పచెల్లెళ్ళలోనూ ముగ్గురికి పిల్లల్లేరు, వాళ్ళు ఎవరినో దత్తు తెచ్చు కున్నారు. కనకం తాతయ్యవాళ్ళు నలుగు రన్నదమ్ములు; ఇద్దరికి పిల్లల్లేరు. మిగిలిన ఇద్దరి పిల్లల్లోంచి దత్తు చేసుకున్నారు.

జనాభాని అదుపులో వుంచటానికైతేనేం, వైధవ్యం ప్రాప్తించిన అభాగినులచేత చాకిరీ చేయించుకోవటానికైతేనేం, ఒకప్పుడు దేశంలో సెక్స్‌ను చెత్తకన్న క్షుద్రంగా చూశారు. ఇప్పుడు సెక్స్ పగ తీర్చు కుంటున్నది. కనకం ముందుకు వెళ్ళటానికి కూడా, దారిలేకుండా నిల బడిన జనం మొహాల్లో సెక్స్ ఆకలి! శరీరాల్లో సెక్స్ తపన!

ఎట్లాగో వాళ్ళను తోసుకుని ముందుకువెళ్ళి, సముద్రం అడుగు నుంచి పైకివచ్చిన తిమింగిలంలాగా, అప్యాయంగా మంచిగాలి పీల్చి చుట్టూ కలయ జూశాడు. అప్పుడు కనిపించిం దామె అతనికి. ఆమె తననిచూసి నవ్వకపోతే ఆమె అనాకారితనాన్ని కనకం అంత పని పెట్టుకుని చూసి వుండేవాడు కాదు.

"ఎవరో వెకిలిది లాగుంది" అనుకుంటూ కనకం మొహం చిట్లించుకున్నాడు. ఆ మనిషి సంసార పక్షమైన అందం కలదైనా అతను సంతోషించి వుండేవాడేమో. కాని ఏమీ అందంలేని మనిషి

తెలియనివాణ్ణి చూసి నవ్వవలసిన అవసరం ఏమీ లేదు— ఎంత వెకిలి దైనప్పటికీ.

ఆమె తన అందం చూసి నవ్విందని కనకం అనుకునే అవకాశం అసలే లేదు. ఆ బస్సులోనే తనకన్న చిన్నవాళ్ళూ అందంగా, డ్రెస్ చేసుకున్నవాళ్ళూ, అందగాళ్ళూ వున్నారు.

"కొంపతీసి నా మొహంలో కూడా సెక్స్ ఆకలి కనిపిస్తున్నదా?" అనుకున్నాడు కనకం. అతని మొహం మరింత మాడింది.

మొకటిసారి కనకం మొహం చిట్లించినప్పుడే ఆమె తననవ్వును ఉపసంహరించేసి మొహం తిప్పేసుకుని మళ్ళీ అతని కేసి చూడలేదు. "కోపం వచ్చినట్టుంది పాపం!" అనుకున్నాడు కనకం. మనుషులకు మాట్లాడే శక్తి లేకపోయినప్పటికీ ఒకరినొకరు మానసికంగా హింసించుకోగలరన్న మాట. ఈపని పశువులు చెయ్యలేవు. దేర్‌ఫోర్, ఒకరి నొకరు మానసికంగా హింసించుకునే శక్తికూడా పరిణామం ద్వారానే మనుషులకు సంక్రమించింది!

"ఇది ఎప్పుడన్నా కథలో పెట్టాలి" అనుకున్నాడు కనకం.

కొందరు కథకులు "ఏరిన ముత్యాలు" పాశ్చాత్య సాహిత్యం నుంచి సంగ్రహించి తమ రచనల్లో తాపటం చేస్తారు. కనకం తన ముత్యాలను తానే పొదవి వాటిని తన కథల్లో పెట్టటం మరిచి పోతూంటాడు.

అన్నట్టు ఆ అమ్మాయి —! ఒక మనిషిని అవమానించినాక వెంటనే మరిచిపోవటం కనకంలాంటి నడిమధ్య తరగతి వాడికి సాధ్యం కాదు: ఆ శక్తి లక్షలకు విలవైనది.

అతను మళ్ళీ ఆమె కేసి చూశాడు. ఆమె ఆడవాళ్ళ సీటులో కూచోలేదు ఆమె పక్కన ఎవరో కూచున్నాడు. ఇద్దరి వాలకమూ చూస్తే పరిస్థితులే వారిని ఒక సీటు మీదికి తెచ్చినట్టున్నాయి. ఆమె

కిటికీదగ్గిర కూచున్నది. అయన నలభై దాటిన వాడల్లే వుంది. సాధ్యమైనంత వంకు ఆమె తగలకుండా, తాను ఆడదాని పక్కన కూచున్నట్టు తనకే తెలియనట్టు మొహం పెట్టటానికి యత్నిస్తూ కూచున్నాడు. ఆమె ఇప్పుడు కిటికీలోనుంచి బయటికి శ్రద్ధగా చూస్తూ, తనను చూసి నవ్వినది మరొకతె అన్నట్టు అభినయిస్తున్నదని కనకానికి అనిపించింది.

"పట్నంలో మగవాళ్ళంత కాకపోయినా ఆడవాళ్ళ మొహాలలోకూడా సెక్స్ ఆకలి కనిపిస్తూనే వుంటుంది. ఇది అదేరకం కావచ్చు" అనుకున్నాడు కనకం. ఈరకం కూరల మార్కెట్టు దగ్గిరా, బస్సుల్లోనూ, సినిమా హాళ్ళలోనూ, తగులుతారు. ఈ ఆకలి ఉత్తరాది వాళ్ళలోకన్న దక్షిణాది వాళ్ళలో చాలా జాస్తి. కారణం ఏమిటో? మేలుకునివున్న ప్రతి క్షణమూ ఆడది తాను ఆడదాన్నని మరిచిపోలేక పోవటమూ, మగవాడు ఆడదాన్ని చూసినప్పుడల్లా అది ఆడదన్న ఆలోచన తప్ప మనిషన్న ఆలోచన లేకపోవటమూ ఎంతఘోరం!

ఒక్కొకక్క స్టాపే వచ్చినప్పుడల్లా క్యూ ముందరికి సాగటం వల్ల కనకం ముందుకువెళ్ళి ఆ అమ్మాయిని అప్పుడే మరిచిపోయినాడు. అతని ఆలోచనలు తాను ఆలోచిస్తున్న కొత్తకథ వేపు వెళ్ళాయి.

కథ రాయటం ఒక కళ అనుకుంటే కనకంలాటి కళాకారులు వింత మనుషుల జాబితాలోకి వస్తారు. అతనికి ఆలోచించదలిస్తే సొంత సమస్యలు ఎన్నయినా వున్నాయి. కాని మనసు నిర్లిప్తంగా వున్నప్పుడు వాటిని గురించి పొరపాటునకూడా ఆలోచించేవాడు కాడు. తాను చదివిన వాటిని గురించో, రాయలనుకున్న వాటిని గురించో ఆలోచించేవాడు. తీరా తన జీవిత సమస్య ఎదురైనదాకా దాన్ని గురించి ఆలోచించే ఓపికలేని కారణంచేత అతను తన జీవితం గురించి చేసే నిర్ణయాలన్నీ అనాలోచితంగా వుండేవి. అతని అప్పులూ,

మిత్రులూ అతన్ని ఒక విధమైన పిచ్చివాకి కింద కట్టేసి. "వీడుకథలు యింతబాగా ఎట్లారాస్తాడు?" అని ఆశ్చర్యపడేవాళ్ళు.

ఆ మాటకువస్తే ప్రతి వాడిలోనూ ఏదోరకం వెర్రి వుంటుంది. డబ్బుకోసమూ కీర్తి కోసమూ యావచ్ఛక్తులు వినియోగించేవాళ్ళు వెర్రివాళ్ళుకారా? జీవితాన్ని అర్థం చేసుకోవటమూ, అనుభవాన్ని జీర్ణించుకోవటమూ నిజమైన జీవిత పరమార్థమని అనకానికి ఒక నమ్మ కం వున్నది. అందుచేత జీవిత సమస్యలతో ప్రత్యక్షంగా, ఒంటరిగా పోరాడటంకన్న, పరోక్షంగా పోరాడటమూ తద్వారా పదిమందికీ జీవితం మరింత బాగా అర్థమయేటందుకు తోడ్పడటమూ మంచిపనిగా అతనికి తోచేది. "నాదగ్గిర ధర్మం చెయ్యటానికి ఒక దమ్మిడీ వుంటే దాన్ని నేను కాన్సరు చికిత్సకు దానం చెయ్యాలా? లేక కాన్సర్ పరిశోధనకు ధర్మం చెయ్యాలా?" అన్న ధోరణిలో ప్రొఫెసర్ హాల్డేన్ ఒక ప్రశ్న ప్రతిపాదించాడు. వైద్యులకు కాన్సర్ వ్యాధి అంతుపట్టే దాకా పరిశోధనల కిచ్చే డబ్బే ఎక్కువ సద్వినియోగం అవుతుందని వేరే చెప్పనక్కర్లేదు.

అదే సూత్రాన్ని కనకం జీవితపు సమస్యలు కొన్నింటికి వర్తింప జెసి చూసుకున్నాడు. ఉద్యోగ సమస్యను పరిష్కరించుకున్న వెయ్యి మందికన్న ఆ సమస్యయొక్క స్వభావాన్ని అర్థం చేసుకున్నవాడు ఒక్కడు లోకానికి ఎక్కువ ఉపకారం చేస్తాడు. వివాహ సమస్య లాటిది ఎన్ని లక్షలమంది పెళ్ళిళ్ళు చేసుకున్నా స్పష్టంకాదు. ఈ విధంగా ఆలోచించి, ఆ ఆలోచన ప్రకారం జీవించటం ప్రారంభించి కనకం పిచ్చివాడనే బిరుదు సంపాదించు కున్నాడు.

# 2

ఎవరో తనను వెనకనుంచి తోస్తున్నట్లు అయేసరికి కనకం వాస్తవ ప్రపంచంలో పడ్డాడు. ఆ అందంలేని అమ్మాయి, తనను రాచుకుంటూ కిందికి దిగిపోయింది. అప్పుడుగాని కనకం తానూ అక్కడే దిగాలని గమనించలేదు. అందరూ దిగిపోయారనుకుని కండక్టరు బుర్రున ఈలవేసి బస్సు కదిలినాక "హోల్డాన్! హోల్డాన్!" అని కేకపెడుతూ కనకం బస్సు దిగాడు.

అది గౌడీయమఠం స్టాపు. ఈ స్టాపులో తానెందుకు దిగాడో జ్ఞాపకం వొస్తుంది. జేబులో కాగితం చూస్తే వెంటనే జ్ఞాపకం వొస్తుంది. దానికి తొందరేమీ లేదు. కనకం కళ్ళు ఆ అమ్మాయికోసం వెతికాయి మరేంలేదు—ఏరకం ఇట్లోకి పోతుందో తెలుసుకోవటానికి! అందువల్ల ప్రయోజనం? ఎప్పుడు ఎందువల్ల ఏం ప్రయోజనముండేది ఎవరు చెప్పగలరు? అది సాధ్యమయ్యేపనికాదని కనకం ముప్పయ్యేళ్ళ అనుభవంలో ఖచ్చితంగా తెలుసుకున్నాడు. ఈ అమ్మాయినే అందగత్తెను చేస్తే ఒక కథకు హీరోయిన్‌గా పనికివస్తుంది. ఆ కథను తాను ఎన్నటికీ రాయకపోవచ్చు— అది వేరేసంగతి.

ఆ అమ్మాయి ఎటో వెళ్ళిపోయుండాలి. పోతేపోయింది. పీడ! కనకం జేబులోంచి ఒక కాగితం తీశాడు. దానిమీద ఆర్. సూర్యనారాయణ అనే పేరు కనిపించింది. అవును. అతనిపేరు సూర్యనారాయణే— సత్యనారాయణకాదు. సన్నగా, పచ్చగా, కొంచెం పొట్టిగా — నే—ఉంటాడు. గానసభ దగ్గర కలిశాడు. బుచ్చిరెడ్డితో కనకం మాట్లాడుతుంటే ఆగి, కాస్సేపుచూసి, వాళ్ళిద్దరూ మాటలు మాని తనకేసి చూశాక, కనకాన్ని పలకరించాడు. ఊరూపేరూ అడి

గాడు. 'మీరేకదా కథలు రాసేది?' అనికూడా అడిగిన మీదట కనకంతో అత్యాశ్చర్యకరంగా చుట్టరికం కలిపాడు. కనకం చిన్నక్క అత్తవారి తాలూకు మనుష్యులు ఆ సూర్యనారాయణకు దగ్గిర బంధువులట. ఆ చుట్టరికం ఏమిటో అతను చెప్పాడుగాని కనకం వినిపించుకోలేదు. 'బిచ్చగాళ్ళు చెప్పుకునే సోది ఎంత వినబుద్దేస్తుందో. కొందరు చదువుకున్నవాళ్ళు చెప్పే సోదికూడా అంతే వినబుద్ధేస్తుంది' అనుకున్నాడు కనకం సూర్యనారాయణ మాటలు వింటూ.

అప్పుడు కలుసుకున్న ఫలితంగా సూర్యనారాయణ కనకాన్ని తన ఆప్తవర్గంలో చేర్చటమూ, ఆదివారంనాడు తమఇంటికి రమ్మని ఆహ్వానించటమూ జరిగింది. కనకం జేబులో చెయ్యి పెట్టేసరికి సూర్యనారాయణ ఇచ్చిన అడ్రసు కనిపించింది. అప్పటికీ ఒక నిర్ధారణకు రాకుండా రాఘవయ్య రోడ్డు బస్‌స్టాప్ దగ్గిరికి వచ్చేసరికి 13 నంబరు బస్సు వచ్చి ఆగింది. కనకం అందులో – ఎక్కేసి గౌడీయమఠానికి టిక్కెట్టు తీసుకున్నాడు.

కనకం తన చేతిలోఉన్న కాగితాన్ని చూసుకుంటూండగా, 'మీరింకా పైకి పోతున్నారనుకున్నాను' అన్నమాటలు వినిపించాయి. కనకం ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూశాడు. ఆ పిల్లే! కనకం వెనక్కి తిరిగి చూస్తే కనిపించి ఉండేదే. ఆమె దిగిన చోటే నిలబడింది కాబోలు. తాను కదులుతున్న బస్సునుంచి కొంత ముందరగా దిగాడు.

'ఇది నన్ను పట్టుకుందేమిటి?' అనుకున్నాడు. కాని మొహం చిట్లించకుండా జాగ్రత్తపడ్డాడు.

'మా ఇల్లిదగ్గిరే, రండి పోదాం' అన్నదా అమ్మాయి.

ఆమె సాహసానికి కనకం నిర్ఘాంత పోయాడు. తనని గురించి ఆమె అభిప్రాయం ఏమిటి? ఏ ఆడకుక్క చూపుడువేలు ఆడించినా తాను పరిగెత్తుకుంటూ వచ్చేస్తాడనా?

కనకం నాజూకైన వెటకారంతో "వద్దునుగాని నాకు మరో చోట ఎంగేజిమెంటున్నది" అంటూ చేతిలోవున్న కాగితం ముక్క ఆడించాడు.

ఆమె చెయ్యిచాచి కాగితం తీసుకుని చూసి "ఇదే మా యిల్లు" అన్నది.

ఈసారి కనకం గట్టిదెబ్బ తిన్నాడు. మహా మహా వాళ్ళకైనా ఎక్కడన్నా దాక్కోవాలనిపించే సమయాలు సంప్రాప్త మవుతాయి. కాని కనకానికి ఇంత పరాభవం ఎప్పుడూ ఎదురుకాలేదు. "వద్దునుగాని"... ఘోరం! అందులోనూ వెటకారంగా! ఎంతనీచం!

"నే నెవరో తెలుసునన్నమాట!" అన్నాడు కనకం హీన స్వరంతో.

"మీరెవరో తెలీకుండానే మా యింటికి ఆహ్వానించా నను కున్నారన్నమాట!" అన్నదా అమ్మాయి నిష్కల్మషంగా నవ్వుతూ.

శిఖండి చాటునుంచి అర్జునుడు భీష్ముణ్ణి కాలసర్పంలాటి బాణం వేసి కొడుతూ, ఆపేక్షగా నవ్వితే భీష్ముడెట్లా ఉండి ఉండునో కనకానికి అర్థమయింది. అతనికి తాత్కాలికంగా మాటుపడిపోయిన సంగతి గ్రహించిన దానల్లే ఆమె "నాపేరు సరస్వతి. సూర్యనారాయణ మా అన్నయ్య. ఆరోజు పాటకచ్చేరీ దగ్గర మా అన్నయ్య మిమ్మల్ని చూశాడు. నన్ను మీకు చూపాననన్నాడు, మీరు బహుశ నన్ను చూచిఉండరు; మిమ్మల్ని బస్సులో చూడగానే పోల్చుకున్నాను. మా యింటికే వస్తున్నారేమో ననుకున్నానుకూడా. కాని మీరు నన్ను చూసి గుర్తుపట్టక పోయేసరికి మీరు మమ్మల్ని అప్పుడే మరిచిపోయా రనుకున్నా. వారం గడిచింది చూడండి. నేననుకున్నట్లే మీరు నాతో బాటు బస్సు దిగే ప్రయత్నం చేయలేదు. ఏదో ఆలోచనలో ఉండి ఉంటారు. ఏకథ ఆలోచిస్తూ ఉండివుంటారు" అన్నది.

'అవును' అన్నాడు కనకం. ఆమె తనని వెటకారం చేస్తున్నదని కూడా అతనికి స్ఫురించలేదు.

'మనం పోదామా' అని సరస్వతి అన్నమీదట కనకం బరువు కాళ్ళతో కదిలాడు. ఆమెకు ఏదోరకం క్షమాపణ చెప్పుకోకపోతే అవమానభారం అతని పైనుంచి దిగేట్టులేదు. కాని క్షమాపణ ఎట్లా చెప్పాలో తెలీలేదు. తను అన్నమాట ఆమె తన అన్నతో చెప్పవచ్చు. చెప్పకుండా మానదగిన కారణం లేదు.

ప్రపంచంలో మంచిచెడలు అనేక పాళ్ళలో వుండేవాళ్ళున్నారు. తాను కథకుడు కాకముందు ఏమనిషి స్వభావం ఎటువంటిదో రూఢిగా తెలిసినదాకా మనిషిని అంచనా వేసేవాడు కాదు. ఇప్పటికీ అతనికి ఇతరుల చెడునుగురించి మరొకరితో చర్చించే అలవాటులేదు. కొందరికి ఇతరుల లోపాలను గురించి ఎంత చెప్పుకున్నా తనివితీరదు, కనకం లెక్కప్రకారం అదొక జాడ్యం. కాని మనిషిని చూస్తూనే సాధ్యమైనంత విపులంగా ఆ మనిషిని అంచనా కట్టాలన్న తహతహ అతనిలో బాగా బలపడింది. తన అంచనాలు అనేకమార్లు గురికి బారెడు ఎడంగాపోవటం జరిగింది అయినా అది తన రహస్యం మాత్రమే అయినంత కాలమూ అతని అంతరాత్మ ఘోషించలేదు. నిజానికి అతను బహిరంగంగా ఇంత 'మూడ' ఎన్నడూ వెయ్యలేదు. బయటపడనంత కాలమూ అతని తప్పుడు అంచనాలు అతనికేమీ నష్టంచెయ్యలేదు— లాభించాయికూడా. తాను తప్పుగా ఊహించుకున్న మనస్తత్వాన్ని పాత్రలకు అంటగట్టి మంచి సజీవ పాత్రలను సృష్టిస్తాడన్న ఖ్యాతి కూడా కొంత సంపాదించుకున్నాడు. 'నువ్వు ఫలాని కథలో సృష్టించిన ఫలాని పాత్ర అచ్చు ఫలాని మనిషే' నంటే 'ఆమనిషి నాకు తెలియను కూడా తెలియదు' అనదగిన స్థితిలో వుంటూ వస్తున్నాడు కనకం. ఒకవేళ తెలిసిన మనిషి అయినా 'నాకు తట్టులేదు సుమా!' అని చిత్తశుద్ధితో అనగలిగేవాడు.

కాని ఇదేమిటి? ఈ సంస్మృతిని గురించి అతను అనుకున్నదంతా అపోహే! ఆమె తనను గురించే నవ్వింది. తాను మొహం చిట్లించగానే అవమానపడి మొహం తిప్పేసుకున్నది. ఆ మూగ అవమానంతో పోనివ్వక తాను ఆమాట ఎందు కనవలసివచ్చింది? ప్రారబ్ధంలోనూ, గ్రహచారంలోనూ నమ్మకం లేదు.

ఇద్దరూ కలిసి నడుస్తున్నారు. ఆమె అకస్మాత్తుగా తల పక్కకి తిప్పి అతని కేసిచూచి "ఏమిటాలోచిస్తున్నారు?" అన్నది.

"నా అతితెలివికి కారణం ఏమిటా అని ఆలోచిస్తున్నాను. ఒక్కొక్కసారి మనం మనకే తెలియనంత గొప్పవాళ్ళమై పోతూంటాం!" అన్నాడు కనకం.

ఆమె దీనికేమీ అనకపోవటం ఎట్లా గ్రహించాలో కనకానికి తెలియలేదు. ఆమెకు తన మాటలు అర్థం కాలేదా? లేక అది ఆమెకు తగిన క్షమాపణగా తోచలేదా? కాని ఆమాట అనెయ్యటం మంచిదయింది కొంత బరువు దిగింది, ఆమె ఇంకా సూటి క్షమాపణ కోరే పక్షంలో తాను తప్పక యిస్తాడు.

"మా అన్నయ్యకు మీ కథలంటే చాలా యిష్టం. మీరు రాసిన కథలన్నీ చదివాడని నా నమ్మకం" అన్నది సరస్వతి.

"నాతో ఆమాటే అన్నారు" అన్నాడు కనకం.

"ఒక్కొక్క ఆర్టిస్టు అదృష్టం... అటువంటి వాళ్ళు మనుషులను తృప్తి పరచటంతో ఊరుకోక వాళ్ళ మనసును జలగల్లాగా పట్టేస్తారు. లతా పాటకు నేనలాగే అవుతాను."

"అనుభవించే వాళ్ళలో కూడా చాలా వుంటుందేమో!" అన్నాడు కనకం.

"అనుభవించే శక్తి వుంటుంది. అంతకన్న ఇంకేముంటుంది?" అన్నది సరస్వతి.

'అందులో ఆర్టిస్టు అదృష్టం ఏముంది?'

'డబ్బుతోనూ, అందంతోనూ కాకుండా ఇంకే విధంగానైనా ఇతరులను ఆకర్షించ గలవాళ్ళు అదృష్టవంతులనే నా నమ్మకం. ఇదే మె ముండే యిల్లు.'

3

క్రకనకాన్ని చూసి సూర్యనారాయణ ఎంత సంతోషం కనబరిచాడంటే, కనకానికి ఒక అనుమానం తగిలింది. తనను యింటికి రమ్మని పిలిచిన సంగతి అతను పూర్తిగా మరిచిపోయినట్టున్నాడు. ఇవాళ మరవటం కాదు. కిందటి ఆదివారం రాత్రి తనను ఆహ్వానించిన మరుక్షణమే మరిచివుండాలి. కనకం తమ యింటికి వస్తున్నాడనుకున్నట్టు సరస్వతి అన్నమాట నిజం కాకపోవచ్చు. ఒకవేళ నిజమైనా అన్న అతని కిచ్చిన ఆహ్వానం గురించి ఆమెకు తెలిసి వుండక పోవచ్చు. రూఢిగా తెలిసివుంటె బస్సులోనుంచి ఒంటరిగా దిగిపోదు...

సూర్యనారాయణ కనకానికి తన భార్యనూ, ఇద్దరి పిల్లలనూ పరిచయం చేశాడు. సూర్యనారాయణ భార్య జయలక్ష్మిని అందగత్తెలలో జమకట్టవచ్చు. సరస్వతి ప్రక్కన మరికొంచెం అందంగా కనపడింద. అయితె ఆమెలో ఆకర్షణీయంగా కనిపించాలనే ఆత్రతయం అందాన్ని మించి వున్నది. కనకం అక్కడ వున్న గంట కాలంలో జయలక్ష్మి ఏదో పనిమీద వెళ్ళినట్టు పడకగదిలోకి వెళ్ళి అయిదారుసార్లు మొహానికి పౌడరు వేసుకు వచ్చింది. పెదవులు తడిగా, నవ నవ

లాడుతూ వుండగలందులకు ఆమె అస్తమానం కనీసం పై వాళ్ళు న్నంతసేపూ— నాక్కుంటుందని కనకం గమనించాడు.

సరస్వతీ కనకమూ కలిపి రావటంచూసి సూర్యనారాయణ వాళ్ళిద్దరికీ పరిచయం అయిందనుకున్నాడు. సరస్వతే అతన్ని తీసుకు వస్తున్నదనుకున్నాడు. అదేమీ జరగలేదని తెలిశాక అతను ఆమెను పరిచయం చేస్తూ 'మా చెల్లెలు, సరస్వతి. ఎమ్మే ప్యాసయింది. లెక్చరరుగా పనిచేస్తున్నది' అన్నాడు.

ఈమాట చెవిని పడగానే కనకం సరస్వతికేసి మరొకసారి చూశాడు. ఆమె మొహంలో ఈసారి అతనికి ఎమ్మే జాడలూ, లెక్చరరు కవళికలూ కనిపించాయి. ఇదికూడా అతనికి పరిపాటే. ఒకసారి ఏదో పత్రిక తిప్పుతుంటే ఒక నీగ్రోవాడి బొమ్మ కనిపించింది. ఆ బొమ్మ క్రింద ఆనీగ్రో దక్షిణాఫ్రికాలోని ఒక ప్రసిద్ధ తెగకునాయకుడని రాసివుంది. మళ్ళా బొమ్మకేసిచూస్తే ఆ నీగ్రోవాడు మామూలు నీగ్రోవాడిలాగా లేడు. అతనిలో రాజలక్షణాలు కొట్టవచ్చినట్టుకనిపించాయి. వాస్తవం తెలపటానికి జ్ఞానేంద్రియాలు చాలవనీ, వార్తా పత్రికలు కూడా కావాలనీ రుజువు చెయ్యటానికి ఇంతకన్న ఏం కావాలి?

సూర్యనారాయణ పిలలు—కొడుకూ, కూతురూ—తల్లిదగ్గిరకన్న సరస్వతి దగ్గిర హెచ్చు మాలిమిగా కనబడ్డారు. కాని జయలక్ష్మి వాళ్ళను ఒక కంట చూస్తూనే ఉన్నది. మధ్య మధ్య వాళ్ళను కళ్ళతో హెచ్చరిస్తున్నది. పిల్లలకు తల్లి బెదురు బాగానే ఉన్నట్టున్నది.

వచ్చిన అయిదు నిముషాలలోనే కనకం జయలక్ష్మి తనకు నచ్చేరకం కాదని తేల్చుకున్నాడు. అతిధిగా వచ్చిన తనపట్ల ఆమె చూపించే శ్రద్ధాసక్తులన్నీ కృత్రిమంగా కనిపించాయి. లోపలికి వెళ్ళేటప్పుడు తనకేసి నవ్వి ఇప్పుడే వస్తానన్నట్టు తల ఆడించి. అతని అనుజ్ఞతో వెళ్ళినట్టు నటిస్తుంది. ఇంత పొడరు పాముకుని తన విషయం చూడటానికే వచ్చినదాని మొహం పెడుతుంది.



సూర్యనారాయణ పాటు కచ్చేరినుంచి సరస్వతితో సహా ఇంటికి తిరిగివచ్చి, కథలు రాసే కనకాన్ని చూశాననీ, పై ఆదివారం టీ కి పిలిచాననీ చెప్పినప్పుడు జయలక్ష్మి 'ఎందుకు కోరితెచ్చు కుంటారో ఇలటి తద్దినాలన్నీ!' అన్నసంగతి కనకానికి తెలీదు. తెలి

సినా పెద్దగా ఆశ్చర్యపడి ఉండేవాడు కాదు. ప్రతి మనిషికీ రెండు ముఖాలుంటాయిగాని. కొందరి ఈ రెండు ముఖాలకూ కొంచెమైనా పోలిక ఉండదు. జయలక్ష్మి ఆ తరగతిమనిషి అయితే కనకానికేమీ ఆశ్చర్యం లేదు.

'ఆరోజు పాట కచ్చేరికి మీరుకూడా వచ్చారా?' అని కనకం జయలక్ష్మిని అడిగాడు.

'లేదండీ! నాకు పాట అంటే అంత ఇష్టంలేదు. రేడియోలో పగలువచ్చే పాటలంత ఇబ్బంది పెట్టవుగాని, రాత్రి తొమ్మిదీ, పది గంటల దాకా పాటకచ్చేరీ వింటే తలనొప్పొచ్చి తెల్లార్లూ నిద్ర పట్టదు' అన్నది ఆమె.

కనకానికీ తమకూ గల చుట్టరికం గురించి సూర్యనారాయణ గాని సరస్వతిగాని అట్టే మాట్లాడలేదుగాని. వాళ్ళకన్న దగ్గిర బంధువు లాగా జయలక్ష్మి 'మీ పెద్దక్కగారి కెందరుపిల్లలు? చిన్నక్కకో? ఆవిడ భర్తేకాదూ మా మావగారి పెత్తల్లి మనవడూ? ఆవిడకెందరు పిల్లలు' అని ప్రశ్నలు ప్రారంభించింది.

అన్నిటికీ కనకం, 'నాకు తెలీదు' అని జవాబు చెప్పాడు. తాను తినవాళ్ళని చూసీ వాళ్ళకు ఉత్తరాలురాసీ ఏళ్ళకేళ్ళయిందని కూడా అన్నాడు.

'అదేమిటలాంటారు?' అన్నాడు సూర్యనారాయణ.

'బంధుత్వాలంటే పనికిమాలిన బంధాలు. కొంతకాలం వాటి వల్ల ఉపయోగం వుంటుంది. ఆ తరవాత అవి సంకెళ్ళే. నేను నా సంకెళ్ళనన్నిటినీ విడగొట్టుకున్నాను. నిజమైన అపేక్షలు మాత్రం ఉక్కించు కున్నానన్నమాట. వాటిని తెంచలేం' అన్నాడు కనకం.

'అపేక్షలవల్ల ఉపయోగం వుండంటారా?' అన్నది సరస్వతి.

కనకం కొంచెం ఆలోచించి, 'ఏమీ లేదు' అన్నాడు. ఈ సమాధానం సమగ్రంగా లేదని తోచి 'అపేక్ష ఉండటమే జీవితానికి ఒక ఆనందం' అన్నాడు.

'ఎవరన్నా వున్న అపేక్షలతో తృప్తిపడవలసిందేగాని లేని అపేక్షలు లేకపోయెనే అనుకోరుగద' అన్నది సరస్వతి.

ఆమె ఏమనటానికి ప్రయత్నిస్తున్నదో కనకానికి అర్థంకాలేదు అతను 'అవును' అన్నాడు, ఐతే ఏమంటూ వన్నట్టు.

'ఎవరిమీదా అపేక్షలేనివాళ్ళు తమ జీవితానికి ఆనందం లేదనుకుంటారా?' అని సరస్వతి అడిగింది.

'అనుకోకపోవచ్చు' అన్నాడు కనకం.

అదే తా ననేదీ నన్నట్టు సరస్వతి తల ఆడించింది.

'మా సరస్వతికి ప్రేమలో నమ్మకం లేదులెండి' అన్నది జయలక్ష్మి.

'బంధుత్వాలు సంకెళ్ళయితే ప్రేమలు రెట్టింపు సంకెళ్ళు. మీ కథలురాసేవాళ్ళూ, సినిమాలవాళ్ళూ దానికి వల్లమాలిన పబ్లిసిటీ యిచ్చారు. నన్నడగితే న్యూసెన్స్ ఇరియస్ డ్రగ్ చట్టం ప్రేమకు అప్లయ్ చెయ్యొచ్చు' అన్నది సరస్వతి.

కనకానికి రోషం వచ్చింది. 'అకారణంగా లోకమంతా ఏకమై ప్రేమకు ప్రచారం ఎందుకిస్తుంది? ఏదో కారణం వుండాలికదా?' అన్నాడతను.

'కారణం ఏం చెబుతాం? ఆత్మవంచన కావచ్చు, పరవంచన కావచ్చు.'

కనకం అట్టే వాదం పెంచదలచలేదు. విషయం వాదనద్వారా ఋజువయేది కాదు. అది అట్లావుంచి అతను సరస్వతి దృక్పథాన్ని సానుభూతితో చూశాడు. ప్రేమవల్ల ఆమెకు పెద్ద అపచారం జరిగి

వుండవచ్చు. జెడిసికొట్టిన ప్రేమా, న్యాయమూ, ధర్మమూ లాటివి అవాస్తవంగా కనిపించటంలో ఆశ్చర్యంలేదు. తనకు బంధుత్వాలంటే అసహ్యం పుట్టలేదా? కనువిప్పనేదే కనుమూతకూడా కావచ్చు.

కొంతసేపటికింద లోపలికి వెళ్ళిపోయిన జయలక్ష్మి సరస్వతిని కేకపెట్టింది. సరస్వతి వెళ్ళిపోయినాక కనకమూ, సూర్యనారాయణా కాస్సేపు ఎవరి ఆలోచనల్లో వారు వుండిపోయారు. కనకం తాము కూచున్న గది కలయజూశాడు. గదిలో అవసరమైన వస్తువులతోబాటు అలంకరణలుకూడా వున్నాయి. వాటికి జయలక్ష్మి బాధ్యురాలై వుండవచ్చునని కనకం అపోహపడ్డాడు. సౌందర్యతృష్ణ సరస్వతిలో వుండ వచ్చునని అతనికి తట్టలేదు.

ఉన్నట్టుండి సూర్యనారాయణ 'మా సరస్వతికి ఇరవైనాలుగో ఏడు. దాని కింకా పెళ్ళికాలేదు. ఆ విషయం ఎత్తినప్పుడల్లా నాకు పెళ్ళి చేసి కంటుంది; మనుషులు సంసారజీవితం అక్కర్లేకుండా బతక గలరన్నట్టుగా ప్రవర్తించే వాళ్ళంటే నాకు మంట. ఆ విషయమై ఒక ఉద్యమమే లేవదీసిన వీరేశలింగంధైర్యం తలుచుకుని నే నాశ్చర్య పడతానంటే నమ్మాలి. సంఘ నిబంధనల మూలంగా ఆడది ఒంటరి బతుకు బతకటమే ఘోరమైతే, నిష్కారణంగా ఆడది జన్మల్లా ఒంటరిగా బతకాలని పసితనంలోనే నిర్ణయించటం ఎంత ఘోరమో ఆలోచించండి. తనకు పెళ్ళి వద్దని అది యిప్పటికి ఆరేళ్ళనుంచీ అంటూనే వున్నది. యింకో పదేళ్ళకి మొగుడికోసమూ, పిల్లలకోసమూ కోరిక పుడితే అది తీరే అవకాశం అసలే వుండదని నాబాధ' అన్నాడు.

'ఆడదిగాని, మగాడుగాని తమకుతామై ఒంటరిగా ఉండగోరితే అందులో ఘోరమేమిటో నాకు అర్థం కాలేను. అక్రమమైన సంఘ నియమాల ప్రోద్బలంవల్ల బాలవితంతువులకు సంసార జీవితం లేకుండా పోతే అది నిజంగా ఘోరమే' అన్నాడు కనకం ఉపన్యాస ధోరణిలో.

సూర్యనారాయణ నవ్వి 'మీరింకేమంటారు? మీకింకా పెళ్ళి కాలేదనుకుంటాను?' అన్నాడు.

'లేదు, కాని నేను భీష్మించలేదు. నాకు పెళ్ళి చేసుకోవటాని కభ్యంతరంలేదు. మామూలు పెళ్ళి చేసుకునే ఉద్దేశం నాకులేదు. నాకు సరిఅయిన భార్య అయే మనిషి కన్య కానవసరం లేదు. విత తువయినా పిల్లలు గలదైనా, నాకన్న పెద్దదయినా కూడా ఫరవాలేదు. అందు చేత నా విషయం వదిలెయ్యండి. మీ చెల్లెలల్లే కాదు — నాకు ప్రేమలో నమ్మకం వుంది' అన్నాడు కనకం.

సూర్యనారాయణ తల అడ్డంగా తిప్పి, 'ఈ నమ్మకాలు నాకర్థం కాలేదు. మా సరస్వతి తనకు ప్రేమలో నమ్మకం లేదంటుంది.—కాని ఉన్నట్టే ప్రవర్తిస్తుంది. దానికి పెళ్ళంటే ఎందుకిష్టం లేదనుకున్నారు? తను అందగత్తె కాదనీ. తనను ఎవరూ ప్రేమించరనీనూ. బొత్తిగా లేనివాళ్ళం కాదు. ఉన్నది తెగనమ్మి కట్నంపోసి అయినా తనకు కావలసిన సంబంధం తెస్తానన్నాను. డబ్బుకోసం పెళ్ళాడేవాడు తనకు కావలసిన మొగుడెట్లా అవుతాడన్నది. గంతకు తగిన బొంత అన్న పద్ధతిలో తనను బోలినవాణ్ణి చూసుకోమన్నా వినదు' అన్నాడు.

'పెళ్ళంటే భయమేమో?' అన్నాడు కనకం. 'నాకున్నది చెప్పొద్దూ!'

'అలా అనుకోను' అన్నాడు సూర్యనారాయణ.

ఇంతలో టిఫినూ కాఫీ వచ్చాయి. సూర్యనారాయణ ఆతిథ్యం స్వీకరించి అందరి దగ్గిరా సెలవు పుచ్చుకుని కనకం బయలుదేరాడు.

'పరాయివారు కారు మాకు బంధువులే: ఎప్పుడన్నా వస్తూం డండి' అన్నది జయలక్ష్మి.

27

# 4

కనకం స్వతహాగా ఏమంత సంపన్నుడు కాకపోయినా మొదటినుంచీ అతనికి ధనికుల స్నేహం వున్నది వాళ్ళు అతన్ని తమతో సమంగా పోషించారు. కనకానికి పొలాలమీద ఏటా రెండువేలకు తక్కువ కాకుండా వస్తుంది. కాని అతను ఎనిమిది పదివేల స్థాయిలో బతికేవాడు. అతను స్నేహితుల ధర్మమా అంటూ ప్రతి వేసవి ఊటీలో గడిపేవాడు. కాశ్మీరూ, సిమ్లా, డార్జిలింగూ మొదలైన చోట్లకి ఫస్టుక్లాసు ప్రయాణాలు చేశాడు. రెండుసార్లు ఢిల్లీ వెళ్లాడు. తామంటే భయపడనివాడు వెంటవుంటే ధనికులు వాణ్ణి తమతో సమంగా చూస్తారు.

ఇప్పుడు పట్నంలో అతనుంటున్నది అతని మిత్రుడు భవానీ ప్రసాదువాళ్ళ ఇంట్లోనే. ఇంటి పనివాళ్ళు అతని పనివాళ్ళే. భవానీ ప్రసాదు భార్యకూడా కనకాన్ని ఆప్యాయంగా చూసేది. 'నువ్వు' అనేది. తన పెత్తండ్రి కూతుళ్ళూ, సొంత అప్పలూ తనపట్ల ఎట్లా ప్రవర్తించారో తలుచుకుంటే కనకానికి భవానీప్రసాదు భార్య ప్రవర్తన అత్యాశ్చర్యకరంగా కనిపించేది.

ఆ భార్యాభర్తల దాంపత్యంకూడా కనకానికి అసాధారణంగా కనపడింది. ఎందుకంటే వాళ్ళు ఎప్పుడూ చిన్న వాగ్వాదం చెయ్యగా కూడా కనకం చూడలేదు. అది ప్రేమతోకూడిన దాంపత్యం అవునో కాదో కూడా. అతనికి తరుచు రెండు రకాలే కనిపిస్తాయి. హెచ్చు మంది తమ 'వ్యక్తిత్వాల'తో ఒకరి కొకరు ఒరుసుకుంటారు. బహు కొద్దిమంది ప్రేమ మూలంగానో, మోహం మూలంగానో తమ వ్యక్తిత్వాలను —కనీసం కొంతకాలంపాటు – చంపేసుకుని పై వాళ్ళకు

ఎబ్బెట్టుగా కనిపిస్తారు. భవానీప్రసాదూ భార్యా ఈ రెండురకాల లోనూ చేరరు.

కనకం వారి దాంపత్యజీవితంగురించి అసూయపడలేదు. అతనికి కావలసింది అటువంటి దాంపత్యం కాదు.

ఈ దాంపత్యాల ఆలోచన ఇటీవల అతని బుర్రలో జాస్తిగా మసులుతూ ఉండటానికి కారణం అతను అదే విషయంమీద కథ ఆలోచిస్తున్నాడు. ఇవాళ ఆ ఆలోచన ఒకదారికి వచ్చింది. అందుచేత అతను మధ్యాహ్నం భోజనం చెయ్యగానే రాయటం ప్రారంభించాడు. అది పూర్తి అయేసరికి అయిదుగంట లయింది.

కథ అయిపోవటానికీ, కల అయిపోవటానికి కొంత పోలిక ఉంది. కనకం అప్పుడే మేలుకున్నట్టుగా తన గది అంతా కలయ జూశాడు. లేచి నిలబడి ఒళ్ళు విరుచుకున్నాడు. కొళాయిదగ్గరికి వెళ్ళి సబ్బుతో మొహం కడుక్కుని, బట్టలు వేసుకుని, కాలినడకన పానగల్ పార్కుకేసి బయలుదేరాడు. రేడియోలో ఒక్కోసారి మంచిసంగీతమే వస్తుంది.

కనకం కాఫీ తాగుదామని పార్కులాండ్స్ దగ్గరికి వెళుతుండగా అప్పుడే బస్సు దిగింది కాబోలు, చేతిలో ప్లాస్టిక్ సంచి పట్టుకుని సరస్వతి రోడ్డుదాటి కూరల మార్కెట్టుకు పోబోతూ కనిపించింది. ఆమె కార్లకోసం రోడ్డు ఎగువకేసి చూడటంలో కనకం ఆమెకు కనిపించాడు.

ఇద్దరూ ఆగి ఒకరినొకరు సమీపించారు. ఎందాకా అంటే ఎందాకా అని అడుక్కున్నారు. 'కూరలు కొనుక్కుపోదామనీ, కాస్సేపు పార్కులో కూచుందామనీ వచ్చాను.' అన్నది సరస్వతి.

'సాయంకాలం వేళ నే నీ పార్కుకు రోజు విడిచి రోజన్నా వస్తాను. మీరెన్నడూ కనిపించినట్టులేదే?' అన్నాడు కనకం.

'నేనైనా ఎప్పుడోగాని రాను. ఈ పూట మావాళ్ళంతా బీచికి వెళ్ళారు. మా వదినిగారివైపు బలగం వచ్చారు తిరుపతి నుంచి. మెరీనా చూడందే వెళ్ళమన్నారు. నన్నుకూడా రమ్మన్నారు. రానన్నాను. వాళ్ళు ఏ తొమ్మిదికో వచ్చేసరికి వంటచేసి ఉంచుతానని మాట ఇచ్చాక నన్ను వొదిలేశారు' అన్నది సరస్వతి

కనకం సరస్వతి వెంటవుండి కూరలు కొనిపించి సంచీ తాను తీసుకున్నాడు.

'ఫరవాలేదు. నేను మోస్తాను. సన్నగా ఉన్నా నాకు నాజూకూ నీరసమూ అన్నవి లేవు మీ దయవల్ల' అన్నది సరస్వతి.

ఇద్దరూ పార్కు ప్రవేశించి, ఇంచుమించు ఖాళీగావున్న ఒక సిమెంటు సీటుమీద కూచున్నారు. తన పక్కనే కూచున్న సరస్వతి కేసి ఒక్కచూపు చూసి, అంతకు మునుపు ఆ సీటును భుక్తం చేసుకున్న మనిషి చివాల్న లేచి దూరంగా వెళ్ళి గడ్డిమీద కూచున్నాడు.

సరస్వతి నవ్వుతూ కనకం కేసి తిరిగి 'చూశారా, నా గాలి సోకుతు దని మగవాళ్ళు ఎలా బెదిరి పారిపోతారో?' అన్నది.

'అదీ ఒక క్వాలిఫికేషనే. అయితే నా మీద ఆ మంత్రం పారలేదు. నేను పారిపోను' అన్నాడు కనకం. అతను ఆమాట సరదాకన్నట్టే అన్నాడుగాని అందులో కొంత నిజం వున్నట్టు అతనిమనస్సుకు తోచింది. 'హాయిగా ఒంటరిగా కూచుందా మనుకుంటే ఈ మనిషి ఎక్కడ దాపరించిందిరా బాబూ?' అన్న భావం అతనికి కలగలేదు. ఆమె కనిపించడం కాలక్షేపానికి సహకరిస్తుందనే భావమే అతనిలో కలిగింది.



కేవలం సెక్సు దృష్టితో చూడకపోతే సరస్వతి అంత వికారంగా కనిపించలేదు. ఆమెను తన వెంట చూసి ఎరిగినవాళ్ళు ఎగతాళి చేస్తారేమోననికూడా అతనికి అనిపించలేదు. ఆ క్షణంలో ఎరిగినవా డెవరన్నా

కనిపిస్తే కనకం గర్వంగా ఆమెను పరిచయంచేసి వుండును. 'ఈమె సరస్వతిగారు, ఎమ్మే. అదేదో కాలేజీలో లెక్చరర్. మాకు దూరపు బంధువుకూడానూ!'

దురదృష్టవశాత్తూ అతనికి ఎరిగినవాళ్ళెవరూ కనిపించలేదు.

'ఇవాళే మీ కథ—'విషబీజం' చదివాను. మా అన్నయ్య మీ కథలు ఎందుకు నెత్తిన పెట్టుకుంటాడో నేను అర్థం చేసుకోగలను' అన్నది సరస్వతి.

'అప్పుడే పత్రికలో వచ్చిందా. నా కాపీ పోస్టులో యింకా నాలుగురోజులకుగాని రాదు. మీ అన్నయ్య కెందుకు నా కథ లిష్టమంటారు? అట్లాగే మీ విషయంకూడా చెప్పేస్తే సంతోషిస్తాను.'

'నా విషయమా?' అన్నది సరస్వతి ఆశ్చర్యంగా.

'మీకు నా కథ లెందుకు నచ్చవో!'

'నాకు నచ్చవన్నానా?'

'వేరే అనాలా?'

సరస్వతి కొంచెం ఆలోచించి 'మీ కథల్లోవుండే పాత్రలు మా అన్నయ్యకు కావలిసినవి. మామూలు మనుషులు అలావుంటే తనకు చాలా యిష్టం' అన్నది.

కనకం ఆశ్చర్యపోయాడు. 'నా పాత్రలు స్వాభావికంగా వుండవా ఏమిటి కొంపదీసి?' అన్నాడు.

'అదికాదు నా వుద్దేశ్యం. మీరు మీ పాత్రలను బహు అల్ప సంఖ్యాకులనుంచి ఎన్నుకుంటారు. ఉదాహరణకి చెబుతాను; మీ హీరోయిన్ లందరూ అందగత్తెలే. హీరోలను తీసుకున్నా, రూపు-రేఖలకి మీ కన్న తీసిపోయేవాళ్ళున్నట్టు కనబడదు. కొద్దిమంది మీ కన్న

కూడా అందంగా వుంటారు అందమైనవాళ్ళు అల్పసంఖ్యాకవర్గం కారని మీ రనగలరా?'

కనకం ఆమెకేసి నిర్ఘాంతపోయి చూశాడు. ఈ విధంగా తన కథలమీద ఏ విమర్శకుడుకూడా ధ్వజమెత్తడు.

'హీరోగాని, హీరోయిన్‌గాని అందంగా వున్నంతమాత్రాన కథకుగాని, కథయొక్క ప్రయోజనానికి గాని యిబ్బందా?' అని అతను ఉపన్యాస ధోరణిలో అడిగాడు.

'కథంతా మారిపోతుందని నా అనుమానం. నేను ఎక్స్‌పర్ట్‌గా చెప్పడంలేదు సుమండీ! సినిమా స్టార్లకూ మామూలు ఆడవాళ్ళకూ తేడా ఒక్కొక్కప్పుడూ ఆకర్షణలోనే. మీరెప్పుడన్నా రత్నావళిని స్టేజీమీద చూశారా? కిందటి నెలకూడా వేషంవేసింది. తెలుగుదే. రేడియో నాటకాల్లో చదువుతుంది. నా స్నేహితురాలు. గొప్పనటి— నామాట మీరు నమ్మగలిగితే. అయితేనేం? సినిమాల్లో దాసీదాని వేషం కూడా ఇవ్వరు. చూడటానికి ఒకమాదిరిగా ఉంటుంగి. ఏ మాత్రమూ ఫొటోజెనిక్ మొహంకాదు'

'నేను సినిమా స్టార్లలాటిపాత్రలు తీసుకోవటంలేదే. మామూలు జీవితాలు జీవించేవాళ్ళనే తీసుకుంటున్నాను కనీసం నా కథలు సినిమాలుతీయటానికైనా పనికిరావే. వాటిలో సినిమా సన్నివేశాలుండవు.' అన్నాడు కనకం దీనంగా.

'నేనన్నది మీరు సరిగా అర్థం చేసుకోలేదు. అందం జీవితంలో ఒక ప్రత్యేక పాత్ర గలిగ ఉంటున్నదనటానికి చెప్పాను. పెళ్ళాలు అందంగానూ, స్టయిలిష్‌గానూ లని వాళ్ళను డిప్లొమాటిక్ సర్వీసులోకి తీసుకోరట! మీ కథల్లోకూడా అందానికి అలాంటి ప్రాముఖ్యమే ఉంటున్నదని నా ఉద్దేశ్యం' అన్నది సరస్వతి.

'నా ఏ కథలో నన్నా హీరోయిన్ అందగత్తెగాక కురూపి అయితే ఆ కథను మార్చవలసి వస్తుందా?'

'మార్చవలసి వస్తుం దనుకుంటున్నండి. మీ 'ఊబిలో మనుషులు' తీసుకోండి. భర్త లేనిపోని నాగరికతలకు పోయి పెళ్ళాన్ని సొసైటీ లేడీ చేయ యత్నిస్తాడు. 'వద్దు మొర్రో' అని మొదట్లో అన్న భార్య చివరకు భర్తకు విడాకు లిచ్చేదాకా వస్తుంది. ఆమె అందగత్తె కనక నేగదా భర్త తన అవమానాన్ని దిగమింగి మళ్ళీ ఆమెను యేలుకుంటాడు?'

'మొగుడిలో మార్పుకు భార్య అందమే కారణమైందని పాఠకులు అనుకుంటే ఆ కథ ఫెయిలయినట్లే! భర్త పశ్చాత్తాప పడ్డాడనీ, తన పశ్చాత్తాపాన్ని ఆ విధంగా వెలిబుచ్చాడనీ నా ఉద్దేశం.' అన్నాడు కనకం.

'నేను కాదనటంలేదు. ఆ భార్య కురూపి అయితే నవ మన్మథులు ఆవిడకోసం అలా ఎగబడతారా? ఆవిడ కాలుజారి తనను విడిచి పోయినాక ఆ కురూపికి భర్త క్షమాపణ చెప్పుకుంటాడా?' అని అడిగింది సరస్వతి.

'అడిగి ఉంటాడనే నా మనస్సులో నమ్మకం. ఇతరులు ఎగబడటం మాట అంతగా చెప్పలేను. లోకంలో ఎక్కువ మందికి అందమైన ఆడవాళ్ళిష్టమైతే అందుకు నేను జవాబుదారుకాను. నా కథకు మటుకు నేను జవాబుదారును'.

'అట్లా అయితే ఆవిడ అందగత్తె అన్నది అంత గుచ్చి గుచ్చి చెప్పకుండా ఉండవలసింది. ఆమె అందానికి ఏదో ప్రయోజనం ఉండాలి గద. లేకపోతే శిల్పం దెబ్బ తింటుంది.'

కనకం మాట్లాడలేదు. సరస్వతి ఓడించటం అతనికేమీ బాగా లేదు. కాని ఆమె చెప్పిన మాటల్లో కొంత నిజం ఉన్నదనటానికి సందేహంలేదు.

'ఇదే ఛాలెంజి: ఈసారి అనాకారి హీరోయిన్‌తో కథ రాస్తాను' అన్నాడతను.

'కొంపదీసి అనాకారి అనకండి — పాఠకులకు జుగుప్స కలగొచ్చు. అందం గురించి ఏమీ అనకుండా వదిలెయ్యండి.'

'ఎందుకు వదిలెయ్యాలి? అనాకారి అని గట్టిగా చెబుతాను.' అన్నాడు కనకం దర్పంగా. అతను అంతకుమునుపు పూర్తిచేసిన కథలో కూడా హీరోయిన్ అందగత్తె నన్నది జ్ఞాపకం వచ్చింది. అతనికి కొద్దిగా సిగ్గేసింది.

'ఆ కథ చదవాలని ఉంది త్వరగా రాయండి. దాంతో నేను కూడా మీ అభిమానుల్లో చేరిపోతానేమో!' అంటూ సరస్వతి లేచింది.

'అప్పుడే? ఇంకా ఏడు కాలేదు!' అన్నా డతను.

'నేను ఇంటికి పోయి ఎనిమిది మందికి వంట చెయ్యాలి ... మళ్ళీ మీరు మా ఇంటికేసి రాలేదు. శలవు రోజుగా చూసిరండి?' అంటూ అతని పక్కనుంచి కూరల సంచీ తీసుకున్నది.

'నాతో ఒకకప్పు కాఫీ తాగరాదూ?' అన్నాడు కనకం.

'పదండి.' అన్న దామె.

ఇద్దరూ ఫామిలీస్ గదిలో చేరి కాఫీ ఆర్డరిచ్చాక సరస్వతి బల్లమీదికి వంగి "నా విమర్శను సీరియస్‌గా తీసుకోకండి. ప్రపంచమంతటా కమ్యూనిజం వచ్చినా స్త్రీల యుగం ఆరంభంకాదు. స్త్రీల ఆధిక్యత మాటకాదు. మగవాళ్లూ, ఆడవాళ్లూ ఒకే స్థాయిలోకి రావటం మాట చెబుతాను. రేపో ఎల్లుండో కమ్యూనిజంలోకి అడుగుపెడుతున్నామనే రచ్చనలు చూడండి. ఎంతసేపూ సాహిత్యంలో హీరో గురించి మాట్లాడతారు. హీరోయిన్ ప్రసక్తే లేదు... అందుచేత నేమిటంటే, మీరు నాతో పంతంపట్టి అనాకారి హీరోయిన్ కథమాత్రం రాయకండి' అన్నది.

'రాస్తానేమోనని భయమల్లే ఉందేం?' అన్నాడు కనకం పుట్టెడు ఆత్మ విశ్వాసంతో చూచుటూ.

'భయమేగాని— రాయలేరని, రాస్తారని కాదు' అన్నది సరస్వతి నిబ్బరుగా చూచుంటూ.

సర్వరు కాఫీ తెచ్చాడు.

## 5

ఆ రాకాసి హీరోయిన్‌తో కథ రాయటం అనుకున్నంత తేలికగా కనిపించలేదు కనకానికి. మొదట్లో ఆషామాషీగా — ఇదొక బ్రహ్మాండమా అన్నట్టు—ఆలోచించాడు. తరవాత దీక్షగా ఆలోచించ టానికి యత్నించాడు. కాని ఆలోచన సాగలేదు. ఎవరిచేతనైనా ఇష్టంలేని పని చేయించవచ్చు గాని మనసుచేత చేయించలేం. చెట్ల మీదుగా వెళ్ళే కోతి ఒక కొమ్మనుంచి ఇంకో కొమ్మకు వెళ్ళినట్టుగా మనసు తనకు నచ్చని ఆలోచన వదిలేసి చల్లగా ఇంకో ఆలోచనను పట్టుకుంటుంది.

మళ్ళా రెండు వారాల అనంతరం అతను పానగల్ పార్కులో కూచుని ఉండగా సరస్వతి ఇంకో కావిడను వెంటబెట్టుకుని అక్కడికి వచ్చింది. రెండో ఆమెకూడా సరస్వతి వయసుదే. అరవానిది. కొద్దిగా ఎం. ఎస్. సుబ్బులక్ష్మి టైప్. సరస్వతి కన్న చాలా చట్లు కుదురైన మొహమే అయినా కనకం కళ్ళకు సరస్వతి మొహంలోనే చురుకెక్కువ కనిపించి ఆశ్చర్యం కలిగింది.

సరస్వతి ఆమెను పరిచయం చేస్తూ, 'సుందరీ సత్యనాథన్. వీళ్ళ నాన్నగారు మన జిల్లాలో చాలా ఏళ్ళున్నారు. తెలుగు దేశపు బళ్ళల్లో చదువుకున్నది. తెలుగు బాగా వచ్చు. తమిళం సంగతి చెప్పనే అక్కర్లేదు. ఈవిడ వ్యాసాలు చాలా తమిళ పత్రికల్లో పడతాయి. మీ కథల్లో తనకు నచ్చినవాటిని అరవంలోకి అనువదించమని సలహా యిచ్చాను' అన్నది.

తాను కనకం రాసిన కథ ఒకటి చదివాననీ, బాగున్నదనీ, తమిళులకు అటువంటి కథలైతే నచ్చుతాయనీ చెప్పి 'మీ కథల కట్టింగులన్నీ వుంటే యియ్యండి' అన్నది.

'మీ ఎడ్రసివ్వండి. పంపిస్తాను' అన్నాడు కనకం.

'ఈ పక్కనే కోట్స్ రోడ్డులో' అంటూ సుందరి యింటినంబరు చెప్పింది.

'అలా చెప్పండి. నేను ఆ వెనుకవీధిలోనే వుంటున్నాను. నేనే తెచ్చి మీ యింటిదగ్గర యిస్తాను' అన్నాడు కనకం.

'చెయ్యండి' అన్నది సుందరి.

'ఇక నేను వెళ్ళాలి. ఇంకా కూరలు తీసుకోలేదు' అంటూ సరస్వతి లేచింది.

సుందరికూడా ఆమె వెంట వెళ్ళిపోయింది. వెళ్ళేటప్పుడామె సుందరి వెనకగా నిలబడి, వెళ్ళొస్తా నన్నట్టు కళ్ళు, తలా ఎగరేసింది. అందులోవున్న ఆత్మీయతకు అర్థం తెలుసుకుంటే బాగుంటుందనిపించింది కనకానికి. పది నిమిషాల తరువాత యిద్దరూ మళ్ళీ అటుగానే వచ్చారు.

'సరసూని బస్సెక్కిద్దాం రండి' అన్నది సుందరి కనకంతో, ఎంతో చనువున్నదానిలాగా.

ముగ్గురూ బస్‌స్టాండు దగ్గరకి వచ్చారు. త్వరలోనే 13 నంబరు బస్ వచ్చి సరస్వతిని ఎగరేసుకు పోయింది.

'మనం ఒకపని చెయ్యగూడదూ ? ఏడే అయింది. నేను మీ వెంటవచ్చి మీ కథలు తీసుకుంటాను' అన్నది సుందరి.

'ఐతే పోదాం. ఆడది అడుగుపెడితే బ్రహ్మచారి గదికి కళ వస్తుంది.'

'తమాషాగా మాట్లాడతారండీ మీరూ !'

తెలుగు కథలు తమిళంలోకి తర్జుమా చేసి పత్రికలలో వేయించటంలోగల ఒక చిక్కు ఏమిటో సుందరి అతనికి దారిలో వివరించింది కథ తెలుగువాడు రాసినట్టు పత్రికలకి తెలియగూడదు. పాత్రలపేర్లూ తమిళదేశానికి సంబంధించినట్లుగా మార్చటం అవసరం.

'ఇందుకు మీ కేమీ అభ్యంతరం లేదుగద ?' అన్నది సుందరి.

'మీరేం చేసినా నా కభ్యంతరం లేదు' అన్నాడు కనకం.

తన ఘోటక బ్రహ్మచారి జీవితంలో కనకం చాలామంది ఆడవాళ్ళకు ఎరలువేసి కొందరిని చిక్కించుకున్నాడుగాని సుందరి అంత సులువుగా చిక్కిన చేప అతనికి జ్ఞాపకం రావటంలేదు. ఒక అరగంటు వుండి, కటింగులు పట్టుకుని వెళ్ళిపోయాక కనకానికి పెద్ద సందేహం వచ్చింది. చేప ఎవరు ? ఎరవేసిన దెవరు ? ... ... ...

రెండు రోజుల అనంతరం సరస్వతి ఉత్తరం రాసింది.

... ... మీ కొత్త కథ యివాళే చదివాను. అందులోకూడా అందమైన హీరోయిన్ వున్నందుకు చాలా సంతోషం ... ... సుందరి కటింగులు తీసుకున్న దనుకుంటాను. మీరు తరవాత నిరాశపడకుండా ముందుగానే ఒక విషయం చెప్పాలి. సుందరి యిదివరకు చాలా తెలుగుకథలు 'తస్కరించి' తన పేర తమిళ పత్రికలో అచ్చేసుకున్నది.

తెలుగు పత్రికలకన్న తమిళ పత్రికలు హెచ్చు డబ్బిస్తాయని బహుశః మీకు తెలిసే ఉంటుంది. ఆమెకు అదే సంపాదన... ...మా అన్నయ్యకు ట్రాన్స్‌ఫర్ అయేటట్టున్నది. అయేట్టయితే నేను ఇల్లు ఖాళీ చేసి ఏ హాస్టలుకో మారాలి. వీలు చూసుకుని పై ఆదివారం మా ఇంటికేసి రండి...'

ఇంకేం? సుందరి అందుకే మళ్ళీ మొహం చూపించలేదు. కథలు పుచ్చుకుని ప్రతిఫలం ముట్టజెప్పి వెళ్ళిపోయింది. కనకం కొద్దిగా మాత్రమే నిరాశపడ్డాడు. సుందరి హృదయాలు దొంగిలించగలది కాదు. ఆమె కాలాటి ఉద్దేశం ఏ కోశానా లేదేమో కూడానూ. అతని ఎదురుగా నెత్తిన ఒక ప్రశ్నార్థకపు గుర్తు వేసుకుని నిలబడి ఉన్న మనిషి సరస్వతి—సుందరి కాదు. సరస్వతిని ఆవరించి ఉన్న సమస్య ఏమిటో, దాని బరువు తన కెందుకో కనకానికి స్పష్టంగా అర్థం కాలేదు.

అన్నట్టు ఆమె ఛాలెంజి అట్లాగే వుంది. తను ఆ కురూపి కథ రాయాలి... ఆలోచించటానికి వ్యవధి చిక్కకుండా వుంది.

సరస్వతి తన జీవితాని కింకేదో పరీక్ష పెట్టినట్టు కనకానికి అస్పష్టంగా తోచి కొద్దిపాటి అందోళన కలిగింది. పనిపెట్టుకుని నోటివెంట ఆమె అనకపోవచ్చుగాని ఆమె తన జీవిత లక్ష్యాలనూ, నమ్మకాలనూ, రచనా విధానాన్నీ, ఛాలెంజి చేస్తున్నట్టే వున్నది. వాటిని ఏ విధంగా సమర్థించుకునేట్టు? అంటే వాటి సత్యాన్ని రుజువు చెయ్యటానికి ఏం చెయ్యాలి?

'నాన్సెన్స్! ఏమీ ఛాలెంజి లేదు. అంతా నా భ్రమే. అవకాశం యిస్తే మనలో వందమంది వంద తప్పులు చూడగలరు. వాళ్ళకోసం మనం ఎక్కడ మారగలం? మన అంతరాత్మ ప్రబోధంవల్ల మనం మారాలి' అనుకున్నాడు కనకం.

కథకుడుగా కనకానికి ఏస్థానం వున్నదనుకున్నప్పటికీ అతని రచనలో "మారువేషం" లేదు. ఆ రచనలకు బురఖా లేదు.

రాయటం అతని జీవితంలో ఒక భాగం. అతని జీవితంతాలూకు రంగమంతా — దాని మంచి చెడ్డ సారం యావత్తూ — రచనల్లో విధిగా కలిసింది. అందుచేత అతను తన రచనలను గురించి అంటీ అంటు నట్టుండేవాడుకాడు. అతని రచనలను విమర్శించటమంటే అతని జీవితాన్ని ఒకవిధంగా విమర్శించడమే.

సరస్వతి వేసిన ప్రశ్నను తర్జుమాచేస్తే 'నన్ను గురించి కథ రాయగలవా?' అవుతుంది. ఆ ప్రశ్నకు సమాధానం ఏమిటి? తన జీవితంలో సరస్వతివంటి దానికి ఎటువంటి స్థానం ఉండేదీ తెలుసుకో గలిగిన మరుక్షణం కథ రాసెయ్యవచ్చు. ఆమెకు ఏస్థానమూ లేని పక్షంలో తాను 'అల్ప సంఖ్యాక వర్గం' (అందమైన వాళ్ళు)పై ఆధారపడి రచన చేస్తున్నట్టు ఒప్పేసుకోవటం మంచిది.

సూర్యనారాయణ వాళ్ళింటికి ఆ సాయంకాలమే వెళదామను కున్నాడుగాని, కనకానికి సుందరి ఇవాళయినా వస్తుందేమోనని ఆశ పుట్టింది. ఏడుగంటులకల్లా తన గదికివచ్చి ఎనిమిదిన్నర దాకా దీపమైనా వెలిగించకుండా కూచున్నాడు. ఆ తరువాత ఇల్లు కదిలి సుందరి ఉండే రోడ్డు ఈ చివరనుంచి ఆ చివరకు నడిచాడు. ఆమె ఉండే ఇంటు నాలు గైదు కుటుంబాలుంటున్నాయి. సుందరి జాడ కనిపించలేదు. కనకం తిన్నగా హోటల్‌కు వెళ్ళి భోజనం చేసి గదికి వెళ్ళి పడుకున్నాడు.

కాని అతనికి వెంటనే నిద్ర రాలేదు. నిద్ర రాకపోగా కథకు ఒకచిన్న పాయింటు అందింది. అదేమిటంటే — కాలమూ, కర్మమూ కలిసివచ్చి తానూ, సరస్వతి ఏకాంతంగా ఒకచోటునే వుండటం జరిగితే తాను ఆమె స్త్రీత్వాన్ని ఎంతకాలం నిరోధించ గలడు? రెండురోజులో వారం రోజులో, పది రోజులో — ఏదో ఒక పరిమితి వుంటుంది; ఆపైన ఆత్మనిగ్రహం పనిచెయ్యదు. కనకం రాసిన ఒక కథలో

ఒకడు ఒకతెమీద! తనకుగల ఏవగింపు తెలపటానికి 'ఈ మనిషి
నా వెంట వుంటే ఒక వారంపాటు నా శీలం నిలబెట్టుకో గలను'
అంటాడు. కనకం ఆ వాక్యం ఆషామాషీకి రాసినదికాదు. అది
అతని జీవిత సత్యం. అతనికి సౌందర్య పిపాస లేకపోలేదు. తన
ప్రణయాలను సౌందర్య పిపాసతో ముడిపెట్టాలని అత నెన్నడూ
ప్రయత్నించలేదు. ప్రయత్నించినా సాధ్యపడదు. శరీరంలోని అంత
స్రావాల ప్రోద్బలంవల్ల, తత్కాలానికి అందుబాటులో ఉన్న కుబ్జ
కూడా నవమోహిని అవుతుంది. ఈ నిజాన్ని నిరాకరించడంవల్ల
మనిషి వున్నతు డవుతాడని కనకానికి ఏ కోశానా నమ్మకంలేదు.

ఆ మాటని కనకం స్వైర విహారాలు చెయ్యలేదు. తన అంత
రాత్మయొక్క గౌరవ మర్యాదలు కాపాడటానికి అతను కొన్ని నియ
మాలు పెట్టుకున్నాడు. అత నెన్నడూ స్నేహితుల భార్యలమీద
మనసు పోనివ్వలేదు. సమాజంయొక్క నీతి కాంతి జీవిత మంతటా
ప్రసరించదు. అందులోని నీడల్లో నీతినియమా లుండవు. సంఘాన్ని
బాధించకుండా నీతిని వుల్లంఘించ దలచిన వాళ్ళు ఈ నీడలో చేరు
తారు. డబ్బుగల వాళ్ళవెంట తిరగటంచేత కనకం అలాటి నీడపట్లు
బాగా ఎరుగును.

ఇంతకూ కథాంశం—హీరో కురూపి అయిన హీరోయిన్‌తో
ఒంటరిగా ఒక వారం గడపవలసి వస్తుంది. మొదట హీరో ఏ మాత్రమూ
చలించడు. హీరోయిన్ అతని కొక మగ స్నేహితుడల్లేనే వుంటుంది.
అతను క్రమంగా ఆమె గొంతులోనూ, ఆలోచనలోనూ, మాటలోనూ,
చేష్టలోనూ ఆడతనం గమనించి ఒక అస్పష్టమైన ఆనందం అనుభ
విస్తాడు. ఆఖరుదశలో అతనికి ఆమెలో దైహిక ఆకర్షణకూడా కని
పించి అంతకంతకూ బలీయంగా పరిణమిస్తుంది ... ... ... కాస్త కిటికీ
లోంచి మలయమారుతం వదులు! దానివెంట నైట్ క్వీన్ ఘుమ

ఘుమలు చేర్చు!... ... ... మొత్తానికి కురూపిని గురించి కథ రాయటానికి పథకమంటూ చిక్కింది.

కనకం కళ్ళు మూసుకుని నిశ్చింతంగా నిద్రపోయాడు.

# 6

మర్నాడు ఎనిమిదిన్నరకు కనకం ఇడ్లీ-కాఫీలపని ముగించుకుని బస్సెక్కి సూర్యనారాయణ యింటికి వెళ్ళాడు. అతన్ని చూస్తూనే జయలక్ష్మి 'ఏవండోయ్! మీకు మేనల్లుడు కలిగాడు' అన్నది గొప్ప శుభవార్త చెబుతున్నట్టుగా.

ఆ వార్త అర్థంకావటానికి కనకానికి పూర్తిగా అరనిమిషం పట్టింది.

'మా చిన్నక్కకి మొత్తం సంతానం ఎంతమంది?' అని అడిగాడు.

జయలక్ష్మి దవడలు నొక్కుకుని ఆశ్చర్యపోతూంటే సరస్వతి చిరునవ్వు నవ్వింది. సూర్యనారాయణ రాయల్లే వుండిపోయాడు. అతను మాట మార్చటానికల్లే, 'అన్నట్లు నాకు ట్రాన్స్‌ఫరయ్యేట్టువుంది. ఇక్కడినుంచి కదలకుండా వుండటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాను. ట్రాన్స్‌ఫర్‌తోబాటు ఇంక్రిమెంటూ, అప్‌గ్రేడింగూ వున్నదనుకోండి. అయినా మా సరస్వతి ఒంటరిదైపోతుంది. మేం విడిగా యింతవరకు వుండలేదుమరి' అన్నాడు.

కనకానికి అకస్మాత్తుగా ఎరగని చోటికి వచ్చిన భావం కలిగింది. ఈ సూర్యనారాయణ తనతో స్వవిషయా లెందుకు చెబుతున్నాడు? అతని భార్య తనకు దగ్గిర బంధువుల్లే నటిస్తుం దెందుకు? అతని చెల్లెలు తనతో సాహిత్యపు సవాళ్ళు చేసే చనువు ఎట్లా సంపాదించుకుంది? వీళ్ళకు తను మనసివ్వలేదు. సూర్యనారాయణ కనీసం తన అభిమాని—ఫాన్. అయినా అతను తన రచనల గురించి ఒక్కముక్క మాట్లాడలేదు. అతనిది ఒక రకం మూగ ఆరాధన లాగుంది. తప్పో, ఒప్పో. తన కథలు గురించి సరస్వతే కొన్ని అభ్యంతరాలు లెవదీసింది. వాటిని కొట్టి పారెయ్యటానికి కూడా లేదు. తాత్త్వికంగా చూస్తే ఆ లోపాల వేళ్ళు తన స్వభావంలోనూ, జీవితంలోనూ కూడా వుండవచ్చు. ఇది కనకాన్ని సన్నగా తొలుస్తున్న భయం. అతను కథలు రాస్తున్నాడంటే ఆ రాయటం వెంబడి కొంత ఆత్మ సంతృప్తి—కాంప్లెసెన్స్—లేకపోలేదు. అందులో ఆత్మ వంచన ఏమైనా ఉన్నదా? అవకాశం తీసుకుని తరిచి అడిగితే సరస్వతి తనలోని లోపాలను మరింత బాగా వివరించ గలుగుతుందా!

"ఆ తెలుగు.- అరవావిడకి కథ లిచ్చేశాను. ఏం చేసుకున్నా నా కేమీ అభ్యంతరం లేదు... ఆవిడకి పెళ్ళీ పెటాకులూ లేవా?" అన్నాడు కనకం సరస్వతితో.

సరస్వతి నవ్వి, తల అడ్డంగా ఆడించింది.

"అయితే నేను బయలు దేరుతాను. మీ రిద్దరూ వుద్యోగాలు చేసుకోబోయే వాళ్ళు కద. తొమ్మిది దాటింది." అంటూ కనకం లేచి నిలబడి చేతి గడియారం చూసుకున్నాడు.

"నాకు మధ్యాహ్నం తరవాతనే పని కూచోండి. కాఫీ అయినా తాగకుండా ఎలా వెళతారు?" అన్నది సరస్వతి.

"ఇదేనా నీ ఆతిథ్యం? భోజనానికి ఉండమనక కాఫీయా ఇస్తున్నావు?" అంటూ సూర్యనారాయణ లేచి నిలబడి, నేను వెళ్ళి

అన్నం తినేస్తాను. మీరు సరస్వతితో మాట్లాడుతూండండి.' అన్నాడు.

ఇద్దరూ బయటి వరండాలో దిగబడి పోయారు.

ఈ ట్రాన్స్‌ఫర్ మా అన్నయ్యకి ఆర్థికంగా దెబ్బ. ఇక్కడ ఇద్దరి సంపాదనా కలబోసుకుని కాలక్షేపం చేస్తున్నాం. కావలిస్తే నేను నెల నెలా కొంత డబ్బు పంపుతా నన్నాను. పంపినా డబ్బు నష్టం ఉండనే ఉంటుంది. నేను వీళ్ళతో ఉంటే నా కింద నెలకో యాభై అయేను, విడిగా ఉంటే కనీసం వంద ఖర్చుకాక తప్పదు.' అన్నది సరస్వతి.

కనకానికి డబ్బుగురించి యింత వివరంగా ఆలోచించే అలవాటు లేదు. కాని, వాళ్ళిద్దరి సంపాదనా చేరి యే ఐదువందలో వుంటుందనుకుంటే అందులో యాభై పెద్దమొత్తమేనని అతను అనుకున్నాడు.

'మా వదినె పెద్ద చిక్కులో పడిపోయింది. ఆవిడకి నా సంపాదన కావాలిగాని నే నక్కర్లేదు, నేను చదువుకునేరోజుల్లో చాలా సూటిపోటిమాటు లనేది. ఉద్యోగం వచ్చినాక కాస్త తగ్గింది' అన్నది సరస్వతి చిన్నగా.

'మీ అన్నయ్య వూరుకుంటాడా ?' అన్నాడు కనకం, తను కూడా రహస్యంగా మాట్లాడుతూ.

'పెళ్ళినాడే నల్లవూసల మధ్య మా అన్నయ్యనుకూడా గుచ్చి మెడలో వేసుకున్నది. ఆడదానికి మగాళ్ళుగాని, ఆడవాళ్ళుగాని అంత హీనంగా ఎందుకు లొంగిపోతారో ... ... ... మరే విధంగా చూసినా మా అన్నయ్య యోగ్యుడు ... ... ఇటువంటి దాస్యం ప్రేమగా చలామణీ అవుతున్నది !'

'ఇది ప్రేమకాదు. వ్యామోహం.'

'అనటానికి మన మేమరం? మా అన్నయ్య నడగండి—ప్రేమే నంటాడు.'

'అందానికి కట్టుపడ్డాడేమో?'

'అందమంటే మొహానే వుండాలిటండీ? ఇల్లంతా నేను పొద్దునా సాయంకాలమూ సర్దుతాను. ఎక్కడ పడేసిన వస్తువు అక్కడే రోజుకు తొంభైసార్లు చూసుకునే అద్దంమీద కుంకమూ, పౌడరూ, నూనెమరకలూ చేస్తుంది. తుడుచుకోవాలని కూడా తెలీదు. చూసి నేర్చుకోదు. మా అన్నయ్య నిజంగా ఏలూరు బదిలీ అయి వెళ్ళి అక్కడ కాపరం పెట్టాడో, రెండు రోజుల్లో ఇల్లు గొడ్లపాక కన్న హీనంగా తయారవుతుంది! ... ...నా మాదిరిగానే మా అన్నయ్యకూ కూడా ఇల్లు చక్కగా ఉండాలి. కళ్ళంలాగుంటే భరించలేడు... ...పిలుస్తున్నారు. కాఫీ రెడీ అయింది లాగుంది' అంటూ సరస్వతి లోపలికి వెళ్ళింది.

సరస్వతి జయలక్ష్మిని గురించి చెప్పిన మాటలు నిజంకాక పోవచ్చుననిగాని, అందులో అతిశయోక్తులుండ వచ్చుననిగాని కనకానికి ఏ మాత్రమూ అనిపించలేదు. తనతో అబద్ధాలు చెప్పటంవల్ల ఆమెకు ఒరిగే దేమీలేదు. అసలు తనతో ఆ విషయం చెప్పటమే వింత. సరస్వతి మాటలు కనకానికి నిజంగా తోచటానికి అసలు కారణం సరస్వతి స్వభావమే. ఆమె తన కథలను తప్పు పట్టినప్పుడు కూడా చెప్పదలచుకున్న దానికంటె తక్కువే చెప్పిందిగాని ఒకరి తప్పును ప్రచారం చెయ్యటంలో తనకు ఆనందం ఉన్నదానిలాగా మాట్లాడలేదు.

ఆమె చెప్పిన రెండు ముక్కలను బట్టే సరస్వతి ఎంతఒంటరి జీవితం జీవిస్తున్నదో ఎంత ఓర్పుతో సహిస్తున్నదో ఊహించటానికి కనకం ప్రయత్నించాడు. పిల్లలంటే ఇష్టం ఉండికూడా పెళ్ళి చేసుకో కూడదని నిశ్చయించు కున్నదంటే తనకు భవిష్యత్తులో కూడా ఏ ఆనందమూ లేకుండా చేసుకుంటున్నదన్నమాట! ముసలిది కాదు.

ముఃతకది కాదు— భవిష్యత్తుపైన ఎన్ని ఆశలైనా ఉండవచ్చు! తన జీవితాన్ని ఏం చెయ్యదలుచుకున్నదీ తెలుసుకుంటే బాగుండును.

సరస్వతి కాఫీ రెండు కప్పుల్లో తెచ్చింది, ఒకటి కనకానికిచ్చి రెండోది తాను తీసుకుని అతని కెదురుగా కూచున్నది.

"ఆ కథ..." అన్నాడు కనకం. "అది మనం పార్కులో కలుసుకోక ముందే రాశాను. మనం మాట్లాడుకున్నాక ఇంకా కథ రాయలేదు. ఆలోచిస్తున్నాను."

"ఓ. నా వుత్తరానికి సమాధానం చెబుతున్నారా? నేను చెయ్యి ఊరుకోక రాశాను. పోనివ్వండి. నన్ను మీరు సీరియస్‌గా తీసుకుంటే డిజప్పాయింటవుతారు" అన్నది సరస్వతి.

"ఊరికే విషయం చెప్పాను. అందమైన హీరోయిన్ లేకుండా నేను కథ రాయలేదన్నది అబద్ధం కాదుగద? అట్లా ఎందుకు చేస్తున్నానాఅని ఆలోచిస్తున్నాను. కారణం మంచిదైతే నా పద్ధతి మార్చుకోను. మంచిది కాకపోతే తప్పక మార్చుకుంటాను. ఆ విషయం నా దృష్టికి తెచ్చినందుకు నేను మిమ్మల్ని థాంక్ చెయ్యాలి."

"లోకంలో లేని విషయం మీరు చెయ్యటంలేదు. ఈనాటి సమాజంలో ప్రయోజకుడైన మగవాడంటే ఆర్జించగలవాడు. ప్రయోజకురాలంటే అందంగావుండే ఆడది. నే చెప్పేదీ, అందం కాకపోతే దాని స్థానంలో ఇంకో క్వాలిటీ వస్తుంది. ఏ ప్రత్యేకతా లేని వాళ్ళకు కళలో స్థానం ఉండటం కష్టం. వాళ్ళలో గొప్పతనం వుండాలి లేదా వాళ్ళు ఒక గొప్పపని చెయ్యాలి. మామూలు మనుషులు ఎక్‌స్ట్రాలుగా కూడా పనికిరారు".

కాఫీ తాగేసి కప్పు కిందపెడుతూ కనకం "నా హీరోయిన్లందరూ అందంగానే ఎందుకుండాలి? వాళ్ళలో ఇంకో గొప్పతనం

ఎందుకుండరాదూ? గొప్ప ఆటగత్తో, పాటగత్తో'' అంటూ ఆలోచనలో పడ్డాడు.

'మన తెలుగు కథల్లో వృత్తి విద్యలుగల ఆడవాళ్ళు హీరోయిన్‌లుగా పనికి రారేమో. ఈ నిర్బంధం మగవాళ్ళకు లేదు. మీ హీరోలు చూడండి— వాళ్ళ అందం అంతగా లేనివాళ్ళుకూడా వున్నారు... చూశారా? మళ్ళా వాగేస్తున్నాను నన్ను దయచేసి మీరు సీరియస్‌గా తీసుకోకండి.'

'నిజం నాకు కాంప్లిమెంటరీగా ఉండాలని నాకులేదు. నిజమైతే నాకు అనుకూలంగా వున్న విషయాలైనా వింటాను. నే నేమనుకుని పోతానో అని నోరుకట్టేసు కోవద్దు' అన్నాడు కనకం.

లోపలినుంచి ఫైటర్ విమానాలల్లే పందెం వేసుకుని పరుగెత్తుకుంటూ పిల్ల లిద్దరూ వచ్చి సరస్వతిమీద పడ్డారు. ఇద్దరి చేతులూ, మూతులూ తడిగా వున్నాయి. అప్పుడే అన్నం తిన్నట్టున్నారు. సరస్వతి పమిటచెంగు చెరొక మూలా పట్టుకుని మూతులు తుడుచుకున్నారు.

ప్రపంచంలో అమ్మకన్న అందగత్తె ఉండదుట. ఈ ఇద్దరు పిల్లల్నీ అడిగితే ప్రపంచంలోకల్లా సరస్వతే అందగత్తె అంటారు కాబోలనుకున్నాడు కనకం పిల్లల చేష్టలు సూక్ష్మంగా గమనిస్తూ. వాళ్ళు సరస్వతిమీదికి ఎక్కటానికి యత్నించారు. కొండలెక్కేవాళ్ళు దొరికిన రాళ్ళనూ, చెట్లనూ పట్టుకున్నట్టు ఆమె బుజాలూ, జుట్టూ, తలా ఉపయోగించుకున్నారు.

సరస్వతి వాళ్ళను చెరొక దెబ్బవేసిన తరవాత కుదురుగా కూర్చున్నారు.

'అమ్మా, నాన్నా ఊరికెళ్ళి పొయ్యేదెప్పుడు?' అని అడిగింది ఆడపిల్ల.

'ఏమో, ఏం తొందర ?' అని సరస్వతి అడిగింది.

'నాకు రైలెక్కా లనుంది.' అన్నాడు కుర్రాడు.

'నువు వెళ్ళనంటివే ?' అని సరస్వతి అన్నది.

'మనం రైలెక్కి ఇంకో వూరు పోదాం అంతగా అయితే.' అన్నది ఆడపిల్ల.

'కాదు. అందరం కలసి పోదాం. నువు కూడారా !' అంటూ కుర్రాడు, అప్పుడే బయలుదేరే వాడల్లే సరస్వతిని చెయ్యి పట్టుకు గుంజ నారంభించాడు.

'నీకు వెళ్ళాలనుంటే అమ్మతో నాన్నతో నువ్వెళ్ళు. నేనూ, అత్తా యిక్కడే వుంటాం హాయిగా !' అన్నది పిల్ల.

కొంచెంసేపు కూచుని కనకం వస్తానని సరస్వతికి చెప్పి బయలుదేరాడు.

## 7

క్రసకానికి కొన్ని రకాల సన్నివేశాలు సరిపడవు. వాటిని తప్పించుకుని తిరగటం అలవాటు చేసుకున్నాడు. పెళ్ళిళ్ళ అప్పగింతలు చిన్న తనం లోనే అతనికి భయంకర మనిపించింది. వేదాంతులు చెప్పినట్లు అన్ని బంధాలూ బాధాకరమైనవే. కాని ఆ బంధాల్లోనే మానవులకు తృప్తి ఆనందమూ వుండటంచేత మనుషులు వాటిని తెంచుకోరు. తల్లీ-బిడ్డలూ, భార్యా - భర్తా, ఈ బంధాలు సాహిత్యంలోనూ, సినిమా



ల్లోనూ మరీ గాఢంగా చూపిస్తారు. అందుచేత వాటివల్ల కలిగే బాధ మరింత దుర్భరంగా వుంటుంది. జీవితంలో యీ బంధాలు మిశ్రమంగా వుంటాయి. కూతురి అప్పగింతలకు బావురుమని ఏడిచే తల్లి కూతురిని అస్తమానం ముద్దు చెయ్యలేదనీ. ఎప్పుడో ఒకప్పుడు, ఎందుకో అందుకు పెట్టవలసిన శాపనార్థాలు పెట్టి వుంటుందని మనం వూహించ

వచ్చు. అట్లాగే భర్తపోతే ఏడిచే భార్య, భర్తే లోకంగా జీవించలేదని అనుకోవచ్చు. ఐనాకూడా యీ బాధలు దుర్భరమైనవి. ఇటువంటి బాధలు ఎరగకుండా దాటిపోయేవాళ్ళే నిజమైన అదృష్టవంతులని అతనికి గట్టి నమ్మకం.

అటువంటప్పుడు అతను, సూర్యనారాయణ భార్యాబిడ్డలతో రైలెక్కుతుంటే సాగనంపటానికి వెళ్ళకుండా వుండవలసింది. సూర్యనారాయణ కూతురు అంత ఏడుపు ఏడుస్తుందని అతనికి ముందుగా ఏం తెలుసు! ఆ పిల్ల సరస్వతిని వెనకవేసుకుని వెళ్ళనంటే వెళ్ళనన్నది.

'శలవు లివ్వగానే నేనూ వస్తానే పిచ్చివానా! ముందుగా వెళ్ళి నువ్వు ఆ వూరంతా చూడు. నేను వచ్చాక నాకూ కాస్త చూపిద్దువుగాని!' అని సరస్వతి ఆ పిల్లను సముదాయించ యత్నించింది.

'నువ్వు అబద్ధం ఆడుతున్నావు! నువు రావు!' అన్నదా పిల్ల.

ఆ పిల్ల పట్టుదల సరస్వతిని ఎంత బాధిస్తున్నదీ కనకానికి అర్థమయింది. సరస్వతి తన వికారాలను పైకి ఏ మాత్రమూ కనబరిచే మనిషి కాదుకూడానూ. 'రైలు త్వరగా బయలుదేరగూడదా?' అనుకున్నాడు కనకం—సరస్వతికోసం.

చివరకు రైలు వెళ్ళిపోయింది. సూర్యనారాయణ పిల్లలిద్దరూ కిటికీ దగ్గిర కూచుని సరస్వతికేసి చాలాసేపు చేతులూపారు. సరస్వతి చేతిలో రుమాలు ఎత్తిపట్టుకుని ఊపింది. చిట్టచివరకు సరస్వతీ, తానూ వెనక్కు తిరిగినప్పుడు కనకానికి ఒక పెద్ద ధర్మ సందేహం పట్టుకున్నది. ఈ ఆపేక్షలు అనివార్యమా? ఆ పిల్ల సరస్వతిని వాటేసుకుని ఏడ్చినప్పుడు, తన నరాలన్నీ బిగదీసుకుపోయి ఉన్నప్పుడతనికి ఈ తాత్విక దృష్టి కలగలేదు. ఆపేక్షలూ, బాధలూకూడా అనివార్యాలే అనిపించాయి. వాటిని అనుభవించక తప్పేది లేదనిపించింది. ఇప్పుడతని వెంట తల వంచుకుని నడుస్తున్న సరస్వతి మొహాన్ని పక్కగా చూసి అతను, 'పిల్లల్ని తెగమాలిమిచేసి తాను

బాధపడి వాళ్ళను బాధ పెట్టింది. ప్రేమలో క్రౌర్యం వుంది...కాని ఈ మనిషి క్రూరమైనదంటే ఎవరూ నమ్మరు!' అనుకున్నాడు.

కనకానికి ఇంకొక వైపరీత్యం స్ఫురించింది—ప్రేమలో విశ్వాసం ఉన్నవా డతను. లేని మనిషి సరస్వతి. తమ పాత్రలు ఎప్పుడు మార్పు చెందినట్లు? నిజానికి తాను ప్రేమ అనుకున్నది స్త్రీ పురుష ప్రణయ ప్రేమ సరస్వతికి అందులో నమ్మకంలేదు. కాని ఆమెకు ఇతర ప్రేమలలో నమ్మకం ఉన్నట్టున్నది. తాను వాటినుంచి ఏనాడో విముక్తి పొందాడు. తానైతే సరస్వతి ఉన్న పరిస్థితిలో ఒక్కక్షణం కూడా సూర్యనారాయణ ఇంట ఉండడు.

"ఇప్పుడెక్కడికి? ఇంటికేనా?' అని అడిగాడు కనకం.

"ఎక్కడికి వెళ్ళినా ఫరవాలేదు ఇంకా రెండు రోజుల వ్యవధి ఉంది ఇల్లు ఖాళీ చెయ్యటానికి. వై డబ్ల్యూ సీ ఏ కు పోదామా అనుకుంటున్నాను."

"ఇంటికి వెళ్ళితే మాత్రం ఏముంది? బావురుమంటుంది. మా ఇంటికి రాగూడదూ నేను మీ యింటి కెన్నిసార్లొచ్చాను. మీరు మా యింటికి రాలేదు."

"పోదాం పదండి."

ఇద్దరూ సెంట్రల్‌నుంచి టాక్సీలో బయలుదేరారు.

"ఆ పిల్లల్ని అంతగా ముద్దు చెయ్యకుండా ఉండవలసిందేమో?' అన్నాడు కనకం.

"పిల్లలకి ఆహారం ఎంత అవసరమో ఆపేక్షలంత అవసరం. మా వదినెకు చేతకాదు. మా అన్నయ్యకి బిడియం. మరీ గోపాలుగాణ్ణి ఇద్దరూ వదిలేసి ఊరుకున్నారు. మా వదినెకు పిల్లల ఉచ్చా, దొడ్డి అంటేనే పడదు. ఎక్కడి కన్నా బయలుదేరేటప్పుడు పిల్లల

నెత్తుకుంటే చీరె నలుగుతుందని గునిసేది. మా అన్నయ్య ఎప్పుడైనా పిల్లల్ని దగ్గరకి తీస్తే, వాళ్ళను దిక్కుమాలిన అలవాట్లన్నీ నేర్పి పాడు చెయ్యొద్దనేది. అది నా మీద విసురు!' అన్నది సరస్వతి.

'మా భవానీ ప్రసాదు పిల్లలు నా దగ్గరకి ఎప్పుడూరారు. వాళ్ళు ఎవరి అపేక్షతో బతుకుతున్నారో తెలీదు.' అన్నాడు కనకం.

భవానీప్రసాదు భార్య మందాకినీదేవి సరస్వతికి ఆప్యాయంగా స్వాగత మిచ్చింది. ఫ్రిజిడేర్‌లోనుంచి రాస్ప్‌బరీ జూస్ సీసా తీసి డ్రింకు తయారు చేసింది. బిస్కట్లు ప్లేటులో అమర్చింది. 'సురేష్', 'కుమార్' అని పిలవగానే యిద్దరు పిల్లలు ఏడేళ్ళవాడూ, ఐదేళ్ళవాడూ పైనుంచి దిగివచ్చారు. కుమార్ కనకంకేసి చూసి ఒక పక్కన చిరునవ్వు నవ్వాడు.

కనకం మందాకినీదేవికి సరస్వతి పరిస్థితి సంగ్రహంగా చెప్పాడు.

'ఇంట్లో పిల్లలు లేకపోతే తోచదు. నా కలాగే వుంటుంది' అన్న దావిడ. కాని అది లాంఛనంగా అంటున్న మాటల్లానే ధ్వనించింది.

సరస్వతి వేరే చోటు చూసుకోవటంగురించి ఆవిడ 'పదో తేదీన మేం బొంబాయి పోతున్నాం; రెండు నెల్లదాకా రాం. మీ కభ్యంతరం లేకపోతే మీ దగ్గరే వుండొచ్చు. పనిమనుషు లిద్దరూ వుంటారు. ఏమీ యిబ్బంది వుండదు' అన్నది.

'ఎందుకు లెండి? నేను యీ నెలాఖరులోపుగానే ఖాళీ చెయ్యాలి. మధ్యలో పదిరోజులు ఎక్కడుంటానూ?' అన్నది సరస్వతి.

మందాకినీదేవి నవ్వి 'ఇల్లు పెద్దది లెండి. మేముండగానే మీరుండవచ్చు. కనకంగా రుంటున్నారు కారా? ఈ పక్కగదు లాయనవి.

ఆయన ఎప్పుడొస్తాడో, ఎప్పుడు పోయేదీకూడా మాకు తెలియదు. అలాగే మీకూ్కడా ఎవరితోనూ సంబంధంలేకుండా రెండు గదులు ఏర్పాటు చెయ్యగలం. నా పెళ్ళి అయేనాటికి యీ యింట్లో చిన్నా పెద్దా కలిసి పదిహేనుమంది వుండేవాళ్ళు. అప్పుడిల్లు కళకళలాడేది. ఇప్పుడంతే బిక్కు బిక్కు మంటున్నదిగాని' అన్నది.

సరస్వతి తనకేసి చూస్తుందేమో! సరే ననమని సంజ్ఞ చేద్దా మనుకున్నాడు కనకం. కాని, సరస్వతి నేలకేసీ, మందాకినికేసీ మాత్రమే చూస్తున్నది. మందాకిని అదొకరకం మనిషి. సరస్వతి తమ యింటికి రాకపోయినా బాధపడదుగాని, వస్తానని అనకపోతే బాధ పడుతోంది. వాళ్ళవన్నీ అవోతరహా మర్యాదలు. ఆవిడ సరస్వతికి చేసే మర్యాదలన్నీ పరోక్షంగా కనకానికే—అతనిమీద తమకుగల మమత్వాన్ని సరస్వతికి తెలియబరచటానికే. సరస్వతిని తమ యింటికి వచ్చి వుండమనటంకూడా అటువంటిదే. 'మీ యిద్దరూ స్నేహితులు గదా? ఒకేచోట వుండటం మీకు బాగుండేపక్షంలో ఆ అవకాశం నే నిస్తాను' అని మందాకిని మాటల అంతరార్థం. సరస్వతికూడా తమ అంతరంగికులలో చేరాక ఆమె వెంట వచ్చేవారికి యిలాటి సత్కారాలే జరుగుతాయి. వాళ్ళ ప్రపంచం యీవిధంగా విస్తరిస్తుంది.

'థాంక్స్. చూద్దాంలెండి ఇవాళ నే నా విషయం ఆలోచించే స్థితిలో లేను' అన్నది సరస్వతి.

'నాకు తెలుసు. మీరు పిల్లల్ని మిస్ చేస్తున్నారు. నేనైనా అంతే' అన్నది మందాకిని.

# 8

"ఇదా మీ గది?" అన్నది సరస్వతి కనకం ఉండేగదిని కలయ చూస్తూ 'పెద్దదే. బాగానే అరేంజి చేసుకున్నారు.'

'ఆ తలుపు వెనకే బాత్‌రూం. ఈ తలుపు వెనక చిన్న వరండా ఉంది.'

సరస్వతి పుస్తకాల రాక్ దగ్గిరికి వెళ్ళి అతను చదివే పుస్తకా లేవో పరీక్షించింది వాటిలో ఒకటీ ఆమె చదవలేదు. సరికొత్త రచయితలవై ఉండాలి. ఖరీదైనవి కూడానూ. ఒకటి రెండిటి అట్టలు తెరిచి చూస్తే వాటిమీద కనకం పేరు లేదు. ఇంకెవరెవరి పేర్లో ఉన్నాయి.

'అవన్నీ స్నేహితు లిచ్చినవే. నేనై పుస్తకాలు సామాన్యంగా కొనను.'

'తెలుగు పుస్తకాలేమీ ఉన్నట్టు లేదే?'

'ఇంటర్నేషనలిజం నుంచి నేషనలిజంకు రావటం వెనకడుగేమో!' సరస్వతి నవ్వింది. ఆమె కళ్ళు బల్లమీదవున్న కాగితాల బొత్తిమీద పడ్డాయి. 'కొత్త కథ ఏదో రాస్తున్నట్టున్నారే. చూడ వచ్చా?'

'పూర్తి కాలేదు. పూర్తి కాగానే ముందు మీరే చూడాలి. ఇది మన ఛాలెంజి కథ.'

సరస్వతి కాగితాల బొత్తి తీసి మొదటి పేజీకోసం వెతికి 'ఆమె

అనాకారిది' ఓ అనాకారి హీరోయిన్ కథా ? తప్పక చదువుతాను. ఇంకా రాయవలసింది చాలాఉందా ?' అని అడిగింది.

'లేదు కొంచమే. ముగింపు కోసం ఆలోచిస్తున్నాను.'

'అయితే చదివేస్తాను ?' అన్నది సరస్వతి.

'చదవండి. చదివి ముగింపు చెబితే చాలా సంతోషిస్తాను అప్పుడిది మీరు కోరిన కథేకాక మీకునచ్చిన కథకూడా అవుతుంది.'

సరస్వతి చదవటం ఆరంభించిన క్షణం నుంచీ కనకం రిజల్ట్సు కోసం ఎదురుచూసే విద్యార్థిలాగా అయిపోయాడు. ఆమె మొహాన కలిగే ప్రతి సున్నితమైన మార్పూ అతని తలలో మీటరు ఆడిస్తున్నది. ఒకసారి ఆమె మొహం చిట్లించేది. ఇంకోసారి చిరునవ్వు నవ్వబోతు న్నట్టు కనబడేది.

కథలో పెద్ద విశేషమేమీలేదు. ఇద్దరు స్నేహితురాళ్ళు విప్ర నారాయణ సినిమా చూసివచ్చి, దేవదేవి నిజంగా అందగత్తె కావాలా అని చర్చించుకుంటూరు. ఒంటరిగా దొరికిన మగవాణ్ణి ఎంత అనాకారి ఆడదైనా చెడగొట్టవచ్చు నంటుంది ఒకతె. ఆ తరవాత ఆ పిల్లా, అందగాడైన హీరో ఒక చోట ఏకాంతంగా తటస్థ పడతారు. వాళ్ళిద్దరూ నిర్జనమైనచోట ఏకాంతంగా చేరగలందులకు కనకం ఒక రైలు ప్రమాదమూ, ఒక ఉప్పెనా సృష్టించాడు. ఆ అనాకారిదాన్ని వారం రోజులపాటు "రెసిస్ట్" చేసిన హీరో ఒకరాత్రి రెసిస్ట్ చెయ్య లేక పోతాడు. అతను హీరోయిన్‌ని ఆలింగనం చేసుకుని, "ఏమిటో అనుకున్నాను. నీలో ఎంత ఆకర్షణ ఉంది !' అంటాడు. అక్కడ కథ ఆగిపోయింది.

చివరి వాక్యం చదివి సరస్వతి కనకంకేసి ప్రశ్నార్థకంగా చూసింది.

'చదవటం పూర్తి అయిందా ?' అన్నాడతను.

'అయింది. మీ హీరోయిన్ — ఆఫ్టరాల్ — ఆకర్షణ గలది గానే కనిపిస్తుంది?' అన్నది.

'లేదే?'

'మీ హీరో అలా అంటాడేం?'

'అతను చెప్పేది అందంగురించే అని ఎందుకనుకోవాలి?' అన్నాడు కనకం.

సరస్వతి మాట్లాడలేదు. మాట్లాడే పక్షంలో ఆమె 'ఇంకే ఆకర్షణ?' అని అడగాలి. అడిగితే బహుశా కనకం చెప్పలేడు. అందుకే ఆమె అడగలేదు.

'ఇంతకీ కథ ఎట్లా ముగిస్తే బాగుంటుందంటారు?' అన్నాడు కనకం.

'మీ హీరోయిన్ పుస్తకాలు చదువుకున్నదైతే 'ఇది ప్రేమేనా? నన్ను పెళ్ళాడే ఉద్దేశం మీకున్నదా?' అంటుంది. తన సుఖమే కోరుకున్నదైతే, మీ సుఖం కోసం ప్రాణాలైనా అర్పిస్తాను అంటుంది. పెడసరం మనిషైతే 'మీరింకా పెద్దమనిషి అనుకున్నాను. మీరూ అందరు మొగాళ్ళంటి వారేనే!' అంటుంది. వెకిలిదైతే, 'ఇదెప్పట్నుంచీ? 'అంటుంది—'

కనకం సరస్వతికేసి కళ్ళు పెద్దవిచేసి చూశాడు. సరస్వతికి ఇంత లోకానుభవం ఎట్లా వచ్చింది? ఈమె ఎటువంటి మనిషి?

సరస్వతి అతన్ని చూసి విరగబడి నవ్వుతూ 'ఎందుకాశ్చర్య పడతారు? మొదటివి పుస్తకాలలో చదివినవీ, చివరవి నా చెవులారా గోడవతలి నుంచి విన్నవీనూ' అన్నది.

'నా కథ మీకు నచ్చలేదన్నమాట?'

'నా మాటకేమిటి? మీకు నచ్చిందా?'

'లేదు. నాకు అసహ్యం వేసింది. పళ్ళు బిగువున రానుకుంటూ వచ్చాను.'

'పూర్తి చెయ్యండి. ఇటువంటి కథలు నచ్చేవాళ్ళున్నారు. ఎటువంటి కథలైనా నచ్చేవాళ్ళున్నారు. చచ్చు కథ అనేది లేదు' అన్నది సరస్వతి.

కనకానికి ఒళ్ళంతా కారం రాచినట్టయింది. అతను పాపం! తన కీర్తిని తెగమోసుకు తిరిగేవాడు కాడు. తెలుగు దేశంలో తన కన్న బాగా రాసేవాళ్ళెందరున్నారో, తనకన్న తక్కువగా రాసేవాళ్ళెందరున్నారో అంచనాలు కట్టటం అతనికి అలవాటు లేదు. సాధారణంగా తెలుగు కథలు చదివేవాడు కాదు—వాటి ప్రభావం తనపైన పడుతుందేమోనని భయం.

అయినా అతను కొంత ఆత్మ సంతృప్తితో ఉంటూ వచ్చాడు. సరస్వతి అడుగడుగునా అతన్ని నిరుత్సాహ పరుస్తూనే వచ్చింది. తనమీద ఆమె కెందుకు పగ? తన కథల్ని, శస్త్ర చికిత్స చేసేటప్పుడు తప్ప మిగతా సమయాలలో ఈ పగ చూపదేం?

క్షణాలమీద అతని బుర్ర సుడిగుండంలా అయిపోయింది. అతను అనకే ఆశ్చర్యం కలిగేటట్టుగా సరస్వతిని చప్పున దగ్గిరికి లాక్కుని ముద్దు పెట్టుకున్నాడు.

సరస్వతి తూలినమనిషి తూకం నిలబెట్టుకోవటానికి తన్ను కున్నట్టు తన్నుకుని అతని చేతులను తోసేసి వినబడీ వినబడకుండా 'థాంక్స్!' అని బయటికి వెళ్ళిపోయింది.

తన హీరోయిన్‌ను వెటకారం చేసిన సరస్వతి అదే పరిస్థితులలో ఏం చేస్తుందో తెలుసుకోవటం కనకం ఉద్దేశం అయితే ఆ ఉద్దేశం

సఫలమయింది...తన హీరోయిన్ శారదకాక సరస్వతి అయితే— రెంటికీ ఒకటే అర్థం. హీరోతో 'థాంక్స్!' అంటుందన్న మాట!

కనకం ఒల్ల దగ్గిరికి వెళ్ళి తన కథ కాగితాలన్నీ తెలికి, వణుకు తున్న చేత్తో, వంకర టింకర అక్షరాలతో, 'థాంక్స్!' అన్నది శారద అని రాసి కింద డాష్ గీసేశాడు.

## 9

"నన్నడిగితే కనకశ్రీ రాసిన కథలన్నిటిలోకీ బెస్ట్! సోమర్సెట్ మామ్ రాయదగిన కథ. చివర ఆ ట్విస్టు! రిమార్కబుల్!"

'కథ బాగానే ఉందిగాని, ఎక్కడో చదివినట్టుందోయ్?'

'పోనిస్తూ—బూర్జువా స్టఫ్! జీవితాన్ని వొదిలేసి ఎక్కడికో పలాయనం చేసే కథలంటే నాకు చెడ్డమంట.'

'నాన్సెన్స్! నువు ఎక్కడికి పలాయనం చేసినా జీవితం నిన్ను వదలదనేది ఆ కథ నిరూపిస్తుంది. అది సింబాలికల్ స్టోరీ! ఆ అనాకారిమనిషి జీవితం. దానిమీద ఎంత రోత వున్నా జీవితేచ్ఛ నిన్ను దానికేసి లాగుతుంది. ఆ భ్రమనుంచి తప్పించుకోలేవు. ఇది మాష్టర్ పీస్. నువ్వు లక్ష చెప్పు.'

ఆ హైదరబాదు హొటల్లోకి అంతకు మునుపే వచ్చిన కనకం పక్క టేబిల్ దగ్గిరవున్న కుర్రాళ్ళు తన సరికొత్త కథ గురించి చర్చించటం విని కంగారు పడ్డాడు. మనుషులు కథలను గురించి ఆలోచిస్తా

రని అతనికి తెలును. వాళ్ళ చర్చలు కథకులు వినే అవకాశం వుంటుం దని అతను కలలోకూడా అనుకోలేదు. కనీసం అతని కెన్నడూ అను భవం కాలేదు. తాను ఫలానా అని ఆ మాట్లాడేవాళ్ళకి తెలీదు. తెలిస్తే తనను విమర్శించేవాళ్ళు, సమర్థించేవాళ్ళుకూడా కాస్త జోరు తగ్గించివుందు రేమో.

భవానీప్రసాదు పక్కబల్లవద్ద జరిగే సంభాషణ విన్నట్టులేదు. విన్నా అతనికి అర్థంకాలేదో. ఈ హైదరాబాదు ప్రయాణం కేవలమూ కనకంకోసమే భవానీ పెట్టాడు. కనకానికి పట్నంలో వుండటం అసంభవ మయింది. తాను సర్వతిపట్ల చాలా తేలిక మనిషిలాగా ప్రవర్తించాడు. అతని అసలు స్వరూపం యింకెవరికీ తెలియకపోయినా సరస్వతికి తెలును. ఎట్లా ఆమె మొహం చూడడం ?

కనకం పశ్చాత్తాపం వెంటనే ప్రారంభం కాలేదు. ఆ దిక్కు మాలిన కథను పత్రికకు పంపినతరవాత ఆరంభమైంది. తన భార్యా పిల్లలూ ప్లేనులో బొంబాయి వచ్చే ఏర్పాటుచేసి భవానీప్రసాదు కనకంతో కారులో హైదరాబాదు వచ్చాడు. తీరా వచ్చినాక భవానీ ప్రసాదుకు హైదరాబాదులో ఏదో పని తగలనే తగిలింది, వాళ్ళు వారంరోజులనుంచీ హైదరాబాదులోనే వున్నారు.

మానవజన్మ అన్నాక అందరూ ఎప్పుడో ఒకప్పుడు ఒక సిగ్గుపడే పని చేస్తారు. కనకం జీవితంలోనే డజను సంఘటన లున్నాయి-జ్ఞాపకం రాగానే తనమీద తనకే అసహ్యంవేసే పనులు సరస్వతిని మొదటి రోజునే పలకరించినప్పుడు తాను అతితెలివిగా అన్నమాట వాటిలో ఒకటి. అటువంటి సంఘటనలను మనసు మరిచిపోవటానికి ప్రయత్ని స్తుంది. ఆ ప్రయత్నంలో ఆ సంఘటనతోబాటు దానికి సంబంధించిన మనుషులనుకూడా మరవ యత్నిస్తుంది. ఐతే కనకానికి సరస్వతి మరుపురాలేదు.

ఘోర మేమిటంటే తాను ఆమెను ముద్దుపెట్టుకోవడం మరవ రాని అనుభవం అయికూచుంది. దానికి కారణం చచ్చినా తెలియడం లేదు. సుందరితో అనుభవం జ్ఞాపకం రాదేం? ఇటువంటి వాటికి కారణాలు వెతకటం వృధా. మనిషి స్వభావపు లోతుల్లోకిపోతే హేతువాదం పనిచెయ్యదు.

క్షమాపణ చెబుతూ సరస్వతికి ఒక ఉత్తరం రాద్దామని కనకం పది సార్లయినా ప్రారంభించాడు. కాని ఒక్కసారీ ఉత్తరం పూర్తి చెయ్యలేదు. ఒకసారి. 'నా మనసులో ఎక్కడో నీ మీద ప్రేమ ఉన్నదనుకుంటాను. ఈ మాట నీవు విశ్వసించాలని కాదు. నేనే పూర్తిగా నమ్మలేనిమాట. నిన్ను నమ్మమని ఎలా అడగను' అని కూడా రాశాడు. ఇంకో ఉత్తరంలో, 'మీ సూర్యనారాయణగారి ఇంటి ఎడ్రసు తెలిస్తే వెళ్ళి చూసి వస్తాను ఆయన హైదరాబాదులో ఎక్కడ ఉన్నదీ నాకు తెలియదు.' అని రాశాడు.

కాని ఒక్క ఉత్తరమూ పూర్తి కాలేదు, పోస్టు అసలే కాలేదు..

ఇప్పుడీ హోటల్లో కూచుని తన కథ గురించి కుర్రాళ్ళు మాట్లాడుకునే మాటలు వింటూంటే సరస్వతి చేసిన ఎద్దేవా జ్ఞాపకం వచ్చింది. ఇటువంటి కథలు నచ్చేవాళ్ళుంటారని సరస్వతి అన్నది. తాను ఆ కథ అసహ్యంగా ఉందని సరస్వతి దగ్గిర ఒప్పుకున్నాడు. కాని దాన్ని ఎవరో తెగమెచ్చుకుంటుంటే కనకానికి సంతోషమే కలిగింది. ఇంకెవరో విమర్శిస్తూ అన్న మాటలు చెవిని పెట్టబుద్ధి కాలేదు.

హోటల్లో పని ముగించుకుని కనకమూ, భవానీప్రసాదూ కారులో బయలుదేరి రెండు ఫర్లాంగులు వెళ్ళారో లేదో కనకం, 'కారాపు! కారాపు!' అని కేకపెట్టాడు. వాళ్ళ కారు ఒక సైకిల్ రిక్షాని దాటి వచ్చింది. ఆ రిక్షాలో సూర్యనారాయణ ఉన్నాడు.

కనకం ఆగిన కారులోంచి దిగి, సమీపానికి వచ్చిన సూర్య నారాయణతో "వెదకబోయిన తీగె కాళ్ళకు తగిలింది, మీ ఎడ్రసు—" అని ఆగిపోయాడు. సూర్యనారాయణ పెద్ద ఆపదలో ఉన్నట్టుగా కని పించాడు. మొహం పెంకులాగా వుంది. హీనస్వరంతో "మీరా?" అని ఊరుకున్నాడు.

"ఎక్కడికైనా తొందర పనిమీద వెళుతుంటే, మా కారుంది రండి" అన్నాడు కనకం.

సూర్యనారాయణ చప్పున దిగి రిక్షావాడికి డబ్బు లివ్వటానికి తొట్రుపడుతూ జేబులో చెయ్యిపెట్టాడు. కనకం రిక్షావాడికి చేతిలో ఒక అర్ధరూపాయపెట్టి, సూర్యనారాయణను కారులోకి ఎక్కించాడు.

"మా పిల్లకి బ్రెయిన్ ఫీవర్... మెనింజైటిస్... హాస్పటల్‌లో నిన్ననే చేర్చాం" అన్నాడు సూర్యనారాయణ.

"హాస్పిటల్‌కు పోదామా?" అన్నాడు కనకం.

"అవును. పోదాం. దగ్గరే ఈ మలుపు తిరిగితే—"

వాళ్లు హాస్పిటలుకు వెళ్ళిన అరగంటకు సూర్యనారాయణ కూతురు పోయింది. కనకం ఎందుకంతగా షాక్ అయినాడో భవానీ ప్రసాదుకూడా ఊహించలేక పోయినాడు. కనకం ఏడుపు మొహం పెట్టలేదన్న మాటేగాని అతని కళ్ళనిండా నీళ్ళు!...

"భవానీ, నేను వెంటనే పట్నం వెళ్ళాలి" అన్నాడు కనకం ఆ సాయంకాలం హొటల్లో.

"నేను?"

"నీ యిష్టం. నువు బొంబాయి వెళ్ళిపో."

"ఒక్కణ్ణేనా?"

"అయామ్ సారీ భవానీ. నేను బొంబాయి రాలేను. సరస్వతికి ఎవరూ లేరు."

"సరస్వతి ?"

"సూర్యనారాయణ సిస్టర్‌మీద బెంగ పట్టుకుందేమిటి ?"

"నీకు చెప్పలేను. చెబితే అర్థం చేసుకోలేవు. ఈ పిల్ల చావు సరస్వతికి పెద్ద షాక్. ఆమె ఏ అఘాయిత్యమన్నా చెయ్యొచ్చు"

"సరే ఇద్దరం పోదాం పద."

మరో గంటకు వాళ్ళ కారు హైదరాబాదు పరిసరాలు దాటింది.

## 10

సరస్వతి కాలేజీలో దొరికింది. అప్పటికే ఆమెకు టెలిగ్రాం అందింది. మనిషిని చూస్తే ఏదో దయ్యంపట్టిన దానల్లే వుంది.

"నేను హైదరాబాదునుంచే వస్తున్నాను. ఈ ఘోరం జరిగేసరికి నేనక్కడే వున్నాను" అన్నాడు కనకం.

"నా మూలంగానే అది పోయింది... ... ...దాన్ని చంపాను" అన్నది సరస్వతి మొహానికి చేతులడ్డం పెట్టుకుని.

కనకం కంగారుగా చుట్టూ చూశాడు.

"ఇక్కడెందుకు ? మా యింటికిపోదాం రండి."

హిప్నాటైజు అయిన మనిషిలాగా సరస్వతి లేచి అతని వెంట వచ్చింది. ఇద్దరూ కారు వెనకసీటులో కూచున్నారు. అంతదాకా బల

వంతాన అణిచిపెట్టుకున్న సరస్వతి దుఃఖం కట్టలు తెంచుకుని వచ్చే సింది. కనకం ఆమె చేతులు రెండూ తన కుడి చేతితో గట్టిగా పట్టు కుని ఎడమచేత్తో ఆమె వీపు నిమిరాడు.

'టెరిబుల్ థింగ్! హారిబుల్! నేను హాస్పిటల్‌లోనే ఏడిచే వాణ్ణి! దుఃఖం ఆగలా!.........మీా రెంత బాధపడతారో నాకు తెలుసు. వెంటనే కారులో బయలుదేరి వచ్చేశాం. భవానీ ప్రోగ్రా మంతా పాడుచేశాను ......... ఇటువంటి బాధలు పంచుకునే వాళ్ళుండాలి.'

కనకం అతికీ అతకకుండా చెప్పేమాటలు సరస్వతికి కొంత వుపశాంతి కలిగించినట్టు కనబడ్డాయి. ఆమె చాలా ఆత్మనిగ్రహం గలది. టెలిగ్రాం అందినాక మూడుసార్లు బాత్‌రూమ్‌లోకి వెళ్ళి ఏడిచి, మొహం కడుక్కుని వచ్చిందట. అదృష్టవశాత్తూ క్లాసులేదు. క్లాసున్నా పిల్లలకు ఏదో పని కల్పించి తాను మెదలకుండా కూచోగలదే. ఆమెకు ఆగకుండా దుఃఖం వచ్చేసింది కనకాన్ని చూశాకనే!

వాళ్ళిద్దరినీ ఇంటిదగ్గిర దించి భవానీ ప్రసాదు కారు తీసుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు.

ఇద్దరూ కనకం గదిలో కూచున్నారు. సరస్వతి ఆ పిల్లను గురించి ఎన్నో విషయాలు జ్ఞాపకం తెచ్చుకుని చాలాసార్లు ఏడ్చింది. కనకం ఆమెను అంతగా ఓదార్చటానికి యత్నించలేదు. ఏడవటం తప్ప సరస్వతికి మరో బాధా నివారణోపాయం లేదు.

అతను రైలు స్టేషనులో జరిగిన సంగతులు జ్ఞాపకం చెయ్యగానే సరస్వతి వివశురాలై ఏడ్చింది. కనకం ఆమె ప్రక్కన కూచుని గట్టిగా పట్టుకుని, 'అట్లా కుళ్ళిపోవద్దు. ఏం చేస్తాం? జీవితం చాలా క్రూరంగా ఉంటుంది. ఈ కష్టం ఇంతలో ఆరేదికాదు. ఏడవటానికి బోలెడంత టైముంది.' అన్నాడు.

'నా గుండెలు మండిపోతున్నాయండీ. నా కోసం దిగులుపడే దానికి మెదడు చెడి ఉంటుంది. తనను చూడటానికి నేను రానని అది అప్పుడే చెప్పింది. పాపిష్టి దాన్ని వెధవ ఉద్యోగంకోసం పిల్లను పోగొట్టుకున్నాను. ఈ బాధతో ఎట్లా బతకటం?' అంటూ సరస్వతి మరింత ఏడ్చింది.

'అదే పొరపాటు. మెనింజెస్ ఎఫెక్ట్ కావటానికీ అపేక్షలకూ ఏమీ సంబంధం లేదు.'

ఆమెను ఆలోచించకుండా చెయ్యటానికి కనకం తడువుకోకుండా తనకు తెలిసిన విషాద గాథలన్నీ చెప్పుకుపోయాడు. ఆమె వింటున్నదా, లేదా అనికూడా చూడలేదు.

కొంచెం సేపటికి సరస్వతి కాస్త తేరుకున్నది.

'మీ భోజనం మాట?' అన్నాడు కనకం.

'నాకేమీ వద్దు. నేనేం తింటాను. గొంతులో ఉలావుండ!' అన్నది సరస్వతి.

కనకం నౌకరును కేకేసి కాఫీ తీసుకు రమ్మన్నాడు. వాడు తెచ్చిన కాఫీని సరస్వతి విషం దిగమింగినట్టు మింగింది.

చీకటిపడే సమయానికి కనకం దీపం వెలిగించాడు.

'ఇక నేను నా లాడ్జికి పోతాను.' అన్నది సరస్వతి.

'లాడ్జిలో ఏముంది? ఇక్కడ అన్నీ జరిగిపోతాయి. స్నానం చెయ్యొచ్చు. భవానీ వచ్చాక మీ చీరెలూ అవీ తెచ్చిపెడతాడు. కాలేజీకి కూడా శలవు పెట్టండి. కొంప మునిగిపొయ్యేదేమీ లేదు.'

"చాలా ఉపకారం చేశారు. నేనేమీ కాను. నన్ను వెళ్ళ నివ్వండి."

"అందుకేనా హైదరాబాదునుంచి హడావుడిగా వచ్చాను."

సరస్వతి దీనంగా నవ్వి "నేనేమీ అఘాయిత్యం చెయ్యనులెండి. మీరు రాకముందు చాలా మోర్బిడ్‌గా ఉన్నానుగాని ఇప్పుడు లేను." అన్నది.

"ఒంటరిగా వుండగానే మళ్ళీ మోర్బిడిటీ రావచ్చు. మీ రిక్కడ ఉండిపోవటానికేమీ మొహమాటు పడక్కర్లేదు"

నౌకరు కారియర్‌లో భోజనం తెచ్చాడు. సరస్వతికి తిండి మింగుడు పడలేదు. కొంచెం చారన్నంతిని వదిలేసింది. కనకం కూడా తిండి సరిగా తినలేక పోయినాడు.

ఆ రాత్రికి పడుకునేటందుకు భవానీ ప్రసాదు సరస్వతికి మంచమూ పక్కా ఇచ్చాడు. దీపం ఆర్పేసి ఎవరి పక్కమీద వారు పడుకున్నాక కనకం కన్ను మూయలేదు. సరస్వతి నిద్రపోయినట్టు కనిపించింది. కాని ఒక అరగంట అవతల ఆమె నిశ్శబ్దంగా ఏడుస్తున్నట్టు అతనికి పొడగట్టింది. అతను లేచి వెళ్ళి ఆమె పక్కన పడుకుని తలా, వీపూ నిమిరాడు.

కొంతసేపటికి సరస్వతి శాంతించి, "నాకీ సేవంతా ఎందుకు చేస్తున్నారు? ఇటువంటి ఋణాలు తీరటం చాలా కష్టం. నాబోటి దానికి అసలు చేతగాదు." అన్నది.

"అటువంటిదేమీలేదు. నాదికూడా మోడు బ్రతుకే. నాకే ఇటువంటి కష్టంవస్తే అర్థం చేసుకుని ఆదుకునే వాళ్ళుంటే వద్దంటానా?" అన్నాడు కనకం.

సరస్వతికి క్రమంగా నిద్రపట్టేసింది. కనకం చాలాసేపు నిద్ర పోలేదు. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు లెక్క పెడుతున్నవాడల్లే అయి పోయి, ఆమె దీర్ఘ నిశ్వాసం విడిచినప్పుడల్లా వీపు నిముదుతూ వచ్చాడు.



గాఢనిద్రలో సరస్వతి అతని డొక్కలోకి దూరింది. ఎప్పుడో చిన్ననాడు ఆ విధంగా ఎవరి డొక్కలోనే దూరిపడుకుని ఉంటుంది.

తాను సరస్వతికి తల్లి అయినట్లుగా తోచి కనకానికి నవ్వొచ్చింది.

# స్నేహితులు



కొడవటిగంటి
కుటుంబరావు



ఆత్మవంచనకు కూడా ఒక హద్దున్నది. ప్రకాశం ఒకంతట నిస్పృహా చెందేటకం కాకపోయినప్పటికి, తన జీవితం విరిగిన పాలవతుగా అయిపోయిందన్నది గుర్తించటం మొదలు పెట్టాడు. ఇక తను అప జయం అంగీకరించవచ్చు. కలలు కనటం మాని నిద్రలేవవచ్చు. తనకు నలభై నిండి నలభై ఒకటి జరుగుతున్నది. అయిదుగురు పిల్లలు. దాదాపు అందరూ రోగిష్టివాళ్ళే. తన సంపాదన నెలకు నూటయాభై- పెద్ద పిల్లకు ఈయేడు కాకపోతే పైయేడు, లేకపోతే ఆ పైయేడు, పెళ్ళిచేసి తీరాలి. లేకపోతే ఇల్లాలు నాగమ్మ ఉరి పోసేసుకుంటుంది. ప్రకాశం మెడకు దేవుడు వేసిన ఉచ్చులను మధ్య మధ్య బిగించేపని నాగమ్మ తనపై వేసుకుని ఆ బాధ్యతను సక్రమంగా నిర్వర్తిస్తున్నది.

"పదహారేళ్ళనుంచీ బడిపంతులు పని అఘోరిస్తున్నాను. బాకీలే తప్ప పాపలాకాసు వెనకెయ్యలేదు. వచ్చే ఏడాది - రెండేళ్ళలో లక్ష్మి పెళ్ళి ఖర్చులూ, కట్నాలూ, యిచ్చుకునే డబ్బు కూడబెట్ట గలనా ? అసంభవం !" అని ప్రకాశం ఒకనాడు అన్నాడు. ఆ మాట అనటంలో ద్రోహ బుద్ధిగాని, అహంకారంగాని మరే యితరమైన అభ్యంతరకర విషయంగాని వుందని ప్రకాశం గర్భశత్రువు కూడా అనడు. అయినా నాగమ్మ ఆ మాటలు వింటూనే కొయ్యబారిపోయి, "అయితే యింతకూ మీ ఉద్దేశం ఏమనీ ?" అని అడిగింది.

"ఉన్నమాట చెబుతుంటే ఉద్దేశాలడుగుతా వేమిటి ?" అన్నాడు ప్రకాశం.

"ఉన్నమాటో లేనిమాటో, ఊరికే చెబుతారేమిటి ?" అన్నది నాగమ్మ. నేనంత వెర్రిదాన్నా అన్నట్టుగా.

"తొమ్మిది గంటు లయిందంటావనుకో, నీ ఉద్దేశ మేమిటని నే నడిగితే అందులో అర్థం ఏముంటుందీ ?"

'ఎందుకుండదూ ? మాచక్కగా వుంటుంది! వంట కాక పోతేనో వేళ మించిపోతేనో కైముగురించి అనుకుంటాం అంతేగాని నిష్కారణంగా—'

'అది ఉద్దేశంకాదు.'

'ప్రతి మాటకూ మీరు వేరే అర్థాలు తీస్తారు. నాకు తెలీదా ఏం ? ఇంతకీ లక్ష్మికి పెళ్ళికి యెగనాం పెట్టటానికేగా మీరు డబ్బు మాట ఎత్తిందీ ?' అని నాగమ్మ దీర్ఘాలు తీసింది.

'ఎగనాం పెట్టదలిస్తే డబ్బు లేదనుకోవటం దేనికి ? ఉన్నా ఎగనాం పెట్టొచ్చునే! ఎగనాం పెట్టాలని లేకనేగదా—'

'డబ్బోక సాకు అంతే. అయ్యో పిల్ల పెళ్ళి వచ్చిపడుతుందే అన్న దిగులు మొదటినుంచీ వుంటే యీపాటికి కొంత వెనకెయ్యలేక పోయామా ? పెళ్ళిఖర్చులమాట యిప్పుడా ఆలోచించేది ?'

నాగమ్మ పరాయిదానల్లే, తన ఆర్థికపరిస్థితిపట్ల అణుమాత్రం సానుభూతి లేకుండా మాట్లాడటం యిది మొదటిసారికాదు. అనేక శతాబ్దాలుగా మగవాడు ఆడదాన్ని హీన ప్రాణిని చేసి, అడ్డమైన కట్టుబాట్లలోనూ వుంచి, దాదాపు ఏ హక్కులూ లేకుండా చేసినందుకు ఆడది తీసుకోగల ప్రతీకారచర్య ఒకటి ఉంది! మగవాడికి ప్రతి క్షణమూ వాడి బాధ్యతలు జ్ఞాపకం చెయ్యడమూ, వాడిమీద వీలయినంత బరువు వెయ్యటమూనూ. ఈ పని చేసే నేర్పు మధ్యతరగతి స్త్రీలలో బహుకొద్ది మందికే ఉంటుంది. వారికి ప్రతినిధి నాగమ్మ. ధనిక వర్గానికి చెందిన మగాళ్ళు పెళ్ళాలు వేసే భారాన్ని సులువుగా మొయ్యగలరు. తమ స్త్రీలకు ఏ హక్కులూ లేవన్న సంగతి జ్ఞాపకం రాకుండా కూడా చెయ్యగలరు. పేదవాళ్ళలో స్త్రీలకు కొంత స్వేచ్ఛ ఉంది. వాళ్ళు తమ బరువు చాలా వరకు తామే మోస్తారు. అవసరమైతే అప్పుడప్పుడూ మొగుడి బరువుకూడా మోస్తారు. ప్రకాశం లాంటి మధ్యతరగతి కుటుంబీకే భార్యల రంపపుకోత భరించే దుస్థితి ఏర్పడుతుంది.

ప్రకాశం యిన్నాళ్ళూ ఆశాజీవిగానే బతకటానికి యత్నించాడు. ప్రత్యక్షంగా వున్న కష్టాలమీద గొంతెమ్మ కోరికల ముసుగులు కప్పాడు. లక్ష్మి పుట్టినాక ఉద్యోగం దొరికింది. లక్ష్మితో తన అదృష్టం తిరిగిందనుకున్నాడు — పదిమందితో అన్నాడు కూడానూ. ఆ రోజుల్లో నూరురూపాయల ఉద్యోగం నిక్షేపంగా కనిపించింది. తానూ, భార్యా, ఒక చంటిపిల్లనూ హాయిగా కాలం గడించింది, జీతం పెరుగుతూ వచ్చింది. దానితోబాటు సంసారం పెరిగింది. వరసగా పిల్లలు పుట్టుకు వచ్చారు. అది తన తప్పేనని ప్రకాశానికి తరవాత గాని తెలిసిరాలేదు. సంసారం పెరగటంతోబాటు వస్తువు ధరలన్నీ పెరిగాయి. అది ప్రకాశం తప్పుకాదు. ఖర్చులు పాపంలాగా రెండింతలూ, మూడింతలూ పెరగకుండావుంటే యింత పెద్ద సంసారాన్ని ప్రకాశం ఏదోవిధంగా యీదుకొచ్చి వుండును. పదిహేను రూపాయలబాడుగ యిచ్చి సుఖంగా గడిపిన ప్రకాశం యీ నాడు అరవైరూపాయిల యింట్లో యిరకలేక సతమతమవుతున్నాడు.

అసహాయస్థితిలో మనిషి తత్వంలో పడతాడు. ప్రకాశం తత్వంలో పడ్డాడు. దారిద్ర్యానికి చాలా ముళ్ళున్నాయి. అందులో ఏ ముల్లు యెక్కువ బాధిస్తుంది? 'పిల్లలు తిండి కేడుస్తున్నారు, ఇంట్లో పాత్రలన్నీ పగిలిపోయాయి. ఆ బాధకన్నా, నా భార్య తన చింకిపాత కుట్టుకోవటానికి సిగ్గుపడుతూ పొరుగావిణ్ణి సూది అడిగితే ఆవిడ యీసడింపుగా లేదు పొమ్మనటం నన్ను హెచ్చుగా బాధిస్తున్నది' అని పూర్వకవి కుచేలు డొకడు శ్లోకం చెప్పాడు. అదేవిధంగా ప్రకాశం దారిద్ర్యబాధను అనేకవైపుల నుంచి సహిస్తూ ఏ వైపునుండి తనకు హెచ్చు బాధ కలుగుతున్నదీ తేల్చుకోలేకపోయాడు.

'ఇప్పటికే ముగ్గురు పిల్లలు. మీ ఆవిడ మళ్ళీ కడుపుతో వుంది. ఈ భాగం మీకు చాలదు. వేరే ఇల్లు చూసుకోండి.' అని ఒకప్పుడు ప్రకాశం ఇంటి యజమాని అన్నాడు.

"ఏదో విధంగా సర్దుకుపోతాం. ఏం చేస్తాం మరి?" అన్నాడు ప్రకాశం, ఇంటాయనికి తనమీద జాలి అనుకుని.

"మీరు సర్దుకుపోతే మేం సర్దుకు పోలేం. ఇల్లు త్వరలో ఖాళీ చెయ్యండి." అన్నాడు ఇంటాయన కుండ పగలేసి.

ఇది ప్రకాశాన్ని బాధించింది.

పొరుగింటివాళ్ళు ఆడపిల్లలకు సంగీతం మేష్టార్ని పెట్టి సంగీతం చెప్పిస్తుంటే తాను ఆ పని చేయలేనందుకు బాధపడినదాకా నాగవ్వ తల్లి వదల్లేదు.

పిల్లలకు తియ్యకుండావుండే రోగాలకు రోజూ డాక్టరును పిలవలేనిస్థితిలో వుండటమూ బాధించింది ప్రకాశాన్ని. డాక్టరుకు ఫీజిచ్చి పిలిపించటంకన్న హెచ్చు ఖర్చు వాళ్ళు రాసిచ్చే మందులు. మందులతో తీరదు. వాటి వెనక టానిక్కులు వస్తాయి. దారిద్ర్యాన్ని ఒక వ్యాధిగా గుర్తించి దాని కెవరైనా చికిత్స చేస్తే ఎంతబాగుండును!

మగపిల్లలు డబ్బూ, ఆడపిల్లలు ఖర్చూ—ఈ సంగతి ప్రకాశం నిజంగా అర్థంచేసుకోవటానికి చాలాకాలం పట్టింది. మొదటి సంతానం ఆడపిల్ల పుడితే అందరూ ఎందుకు దిగులుపడతారో అతనికి అర్థమయేదికాదు; మగపిల్లవాడి తండ్రి అనిపించుకోవటంకంటె ఆడపిల్ల తండ్రి అనిపించుకోవటంలో ఏదో విశేషం ఉందనుకునేవాడు. కాని స్వానుభవంమీద లోకమనుకునేదే నిజమనీ, తనది భ్రమ అనీ అతనికి తెలిసివచ్చింది. లక్ష్మి మగపిల్లవాడైతే యింకో రెండేళ్ళలో ఓ పాతిక రూపాయలు ఏదో విధంగా తేగలిగేవాడు. ఇంకో రెండేళ్ళకు లక్ష్మి తనకు చెయ్య గలిగిందేమిటంటె తనచేత మూడు నాలుగు వేలు - ఎక్కణ్ణుంచైనా రానీ!—ఖర్చు చేయించటం!

లక్ష్మి తరవాతనైనా మగపిల్లవాడైతే బాగుండేది. కాని

రెండోదీ ఆడపిల్లే అయింది. లక్ష్మి పెళ్ళినుంచి కోలుకునేలోపుగా దాని పెళ్ళి వచ్చిపడుతుంది. ఇవే నిజమైన వ్యాధులు!

మూడోవాడు ముక్తేశ్వర్రావు. వాడింకా ఆరోస్టాండర్డు అఘోరిస్తున్నాడు. అర్భకుడూ, మందమతీనూ, జ్ఞాపకశక్తిలేదు. ఎంతకష్టపడినా హానిహానిగా ప్యాసుమార్కులొస్తాయి. బహుశా స్కూలుఫైనల్ దగ్గిర మొండి పడతాడు. 'వాడికి ట్యూషనుపెడితే మంచి మార్కులే వస్తాయి. వాడు తెలివి తక్కువవాడేమీకాదు.' అని నాగమ్మ ప్రవచించింది.

'వాడి చదువుకు సహాయం చెయ్యటానికి నేనుంటినిగా?' అన్నాడు ప్రకాశం.

'మీరా? మీవల్ల ఏమవుతుంది?' అని నాగమ్మ తేల్చేసింది.

'ఎందుచేతా?' అన్నాడు ప్రకాశం.

'మీవల్లఅయేట్టుంటే యితర పిల్లలెవరూ చెప్పించుకోరేం?' అన్నది నాగమ్మ.

'ముత్తిగాడు' తండ్రిని సహాయం చెయ్యనివ్వడు! అసలు సంగతి అదీ. 'ఏమ్రిటా నువు చదివేది?' అంటూ ప్రకాశందగ్గరికి వస్తే చాలు. వాడు పుస్తకాన్ని రొమ్ముల కదుముకుని 'ఏదోలే!' అంటాడు. లేకపోతే చదువు కట్టిపెట్టేస్తాడు.

ప్రకాశం ఆశావాదిగా భవిష్యత్తు బాగుంటుంది. ఏదో జరుగుతుంది. ఏమిటో అవుతుందని తనలో ఆశపడుతూ వచ్చాడు. ఆ ఆశ కూడా అతని ఆర్థికపరిస్థితి లాగా కృశిస్తూ వస్తున్నది. అతనికి తన దారిద్ర్యం కన్న సినిమాలలో చూపే దారిద్ర్యం భయంకరంగా కనిపించేది. సినిమాలలో దారిద్ర్యం అనుభవించేవారి మధ్య ఆత్మీయత ఉంటుంది! ఒకరి దుస్థితిని చూసి ఒకరు రెట్టింపు బాధపడతారు. అదీగాక ప్రపంచమంతా వారిపై కత్తికట్టినట్టు కనిపిస్తుంది. అందుచేత ప్రేక్షకుడి ప్రాణాలు అల్లాడిపోతాయి.

తన దారిద్ర్యానికి యీ లక్షణాలేవీ లేవు. 'అయ్యో, నా పెళ్ళాన్నీ, పిల్లల్నీ యీ దారిద్ర్య బాధనుంది తప్పించలేక పోతినే!' అని ప్రకాశం ఎన్నడూ తన గుండెను చెరువు చేసుకోలేదు. తమకు సరిగా తిండికే చాలదన్న విషయం గుర్తించక నాగమ్మ ఎవరో కట్టుకున్న ఉప్పాడ జరీ చీరెల్నీ, ఎవరో కొనుక్కున్న కొత్తరకం బంగారు గాజుల్నీ గురించి లొట్టలు వేస్తూ చెబుతుంటే ప్రకాశానికి మండుకొచ్చేది. బరువు మోస్తున్న తనపట్ల నాగమ్మకుగాని, పిల్లలకుగాని ఏమీ సానుభూతి లేదు. వాళ్ళు చూసినదల్లా తన అప్రయోజకత్వమే!

ఇదొక విషయం. రెండో విషయమేమిటంటే లోకం తనని క్రూరంగా చూసినట్టు కనిపించలేదు. ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడన్నా ఎరిగినవాళ్ళు ప్రకాశానికి సహాయ పడుతూనే వున్నారు. అతనైనా మరీ గండకత్తెర వచ్చి పడితే తప్ప యెవరిదగ్గిరా చెయ్యి చాచడు.

మూడో విషయమేమంటే తాను నిరుద్యోగికాడు. ఉద్యోగం ఉన్నది. నూటయాభై రూపాయలు నెల కాగానే చేతికందుతాయి. ఉద్యోగం చేసుకుంటూ నెలకు అరవైరూపాయలు ఇంటిఅద్దెకింద కట్టేవాడు బిచ్చగాడెలా అవుతాడు? తొంభైరూపాయల మీద ఏడు జీవాలు బతకడం ఎలా? ఈ రెండు ప్రశ్నలకూ సమాధానం లేదు.

సినిమా దారిద్ర్యానికీ తన దారిద్ర్యానికీ ఏవిధమైన పోలికా లేక పోయినా దానిలాగే యిదికూడా యెప్పుడో ఒకప్పుడు అకస్మాత్తుగా సుఖాంతమవుతుందని ప్రకాశం ఆశిస్తూ వచ్చాడు.

ఈ లోపల అప్పులు పెరిగి పోతున్నాయి. దుకాణంవాడు అరువివ్వననేశాడు— రెండునెల్ల వెచ్చాల బాకీ దిగబడి పోయింది. బట్టల కొట్టువాడు సగమన్నా ఇయ్యమని ప్రాధేయ పడుతున్నాడు. సాటి ఉపాధ్యాయుడు పార్వతీశం దగ్గిరచేసిన చేబదులు తీరనేలేదు. జీతం పుచ్చుకునేరోజు పార్వతీశం మొహం చూడటం కష్టంగా వుంది.

'మనకన్న దారిద్ర్యం అనుభవిస్తున్న వాళ్ళు - ఇంకా పెద్ద సంసారాలు కలవాళ్ళూ, అసలు ఏ సంపాదనా లేనివాళ్ళూ ఎందరు లేరు?' అన్న ఆలోచననుంచి ఏ విధమైన తృప్తీ కలగటం మానేసింది ప్రకాశానికి. ఒకడి పంటిసలుపు మరొకడికి తెలీదు. ఎవడి దారిద్ర్యం వాడిదే. ఎవడి చావు వాడు చావాలిసిందే.

కమ్యూనిస్టు సత్యనారాయణ యీమాటకూడా అనుకోనివ్వడు. పంటి సలుపూ, చావూ వ్యక్తిగతమైనవేటుగాని, దారిద్ర్యం సాంఘిక మైనదట.

'అయితే నా దారిద్ర్యం అందరూ అనుభవించరేం?' అన్నాడు ప్రకాశం.

సత్యనారాయణ ఏదో చెప్పుకుపోయాడు. చిట్టచివరకతను పంటిసలుపూ, చావూకూడా సాంఘికమైనవేనని తేల్చాడు. సంఘం సరిగా ఉంటే యెవరూ చావరా అని ప్రకాశం అడిగాడు. అకాల మరణాలుండవన్నాడు సత్యనారాయణ.

భగవాన్లు గ్రహచారమంటాడు. అతను ప్రకాశం చక్రంవేసి చూసి 'ఇంకో రెండేళ్ళు మీ పరిస్థితి యిట్లాగే వుంటుంది. ఆ తర వాత చాలా సుఖంగా నడుస్తుంది' అన్నాడు; ఆమాట నమ్మబుద్ధయింది ప్రకాశానికి. అతనిలో ఉండే ఆశావాదానికి జోస్యం నచ్చినట్టుగా విప్లవవాదం నచ్చలేదు. సంఘం యావత్తూ మారితే తప్ప స్థితి మారదంటే యెట్లా మరీనూ! సంఘం మారకుండా ఎంతమంది పరిస్థితి మారటం లేదు?

భగవాన్లు చెప్పిన గడువింకా నాలుగైను నెలలుందనగా ప్రకాశానికి నిరాశపట్టుకుంది. దానికి కారణం ప్రకాశానికి జాతకాలలో నమ్మకం పోవటం కాదు — వారఫలాలు ఏ వారమూ తనకు నిజం కాకపోయినా వాటిని అతను చూడటం మానలేదు; నలుగురు నాలుగు రకాల ఫలితాలు చెబితే వాటిలో

తనకు అనుకూలంగా వుండే ఫలితాలమీదనే ఆశలన్నీ పెట్టుకుంటూ వచ్చాడు కూడా. అయితే యిప్పుడు ప్రకాశాన్ని నిరాశ ఆవరించటానికి కారణం — నిరాశా భయం! ఇంకో నాలుగైదు నెలల్లో తన పరిస్థితి బాగుపడకపోతే తాను అశించటానికి ఏ అధారమూ ఉండదు. ఈ భయం ప్రకాశాన్ని పీడించ నారంభించింది.

## 2

వెంకట నారాయణకు శలవు మంజూరయింది. నెలరోజులు నిశ్చింతగా తిరగవచ్చు. కాని యెక్కడ తిరగాలన్న విషయం భార్యాభర్తలమధ్య వివాదం రేపెట్టింది.

'మా బంధువుల ఊళ్ళకు కాకుండా యింకెక్కడికైనా సరే.' అన్నది సత్యవతమ్మ.

'మరీ దూరం కాకుండా వుంటే యెక్కడికైనా ఫరవాలేదు' అన్నాడు వెం.

'కాశో రామేశ్వరమో వెళ్ళితే నాలుకాలాలుపాటు చెప్పుకునేందు కుంటుంది' అన్నది స.

'అవా దగ్గరచోట్లు?' అన్నాడు వెం.

'దగ్గరని నే నెప్పు డన్నానూ?' అన్నది స.

'దూరం వెళితే డబ్బు చాలదు. రెండు మూడొందలకన్నా ఖర్చు పెట్టటం వొట్టి అవివేకం.'

'ఐతే మీావేపు బంధువుల వూరేవన్నా చూడండి. వెళ్ళి సెల్లాళ్ళు తిష్ఠవేద్దాం తేలికలో పోతుంది.'

'ఏ బంధువులు మన్ని కూచోబెట్టి మేపుతారు? హోటళ్ళలో వుండేట్టయితే యెంతడబ్బూ చాలదు. అంచేతా—'

సత్యవతమ్మ అధ్యక్షుడి అంత్యోపన్యాసం చెప్పేసింది :

'చూడదగిన చోట్లేమో దూరం. రైలుచార్జీలు జాస్తి. అయిన వాళ్ళిళ్ళకుపోతే ఒకటి రెండురోజులు మించి వుండటానికి లేదు. వాళ్ళుంచుకోరు. హోటళ్ళలో వుండటం అన్నివిధాలా దండగ. చూడ టాని కేమీాలేని వూరెళ్ళి హోటలుతిండి తింటూ డబ్బు తగలేసు కోవటం ఇంట్లో కూచోవటంమేలు. మీా రెందుకు శలవు తీసు కున్నారో తెలీటంలేదు. మనం బయటిప్రపంచంలోకి అడుగుపెట్టడానికి నోచుకోలేదు. అసలు విషయం అదీ!'

'పోనీ నువ్వే చెప్పు' అన్నాడు వెం.

'అయ్యో బాబూ! మిమ్మల్నేమీా అనలేదండీ. ఉన్నవిషయమే చెబుతున్నా. హాయిగా ఏ కాశో, ఏ రామేశ్వరమో—'

'కాశీకి పోవటానికి మూడు రోజులూ, రావటానికి మూడు రోజులూ, అక్కడ మూడు రోజులూ - మిగిలిన మూడు వారాలు ఏం చేసేట్టు? ఈ తొమ్మిది రోజులకుగానూ యెంతవుతుంది. నాలుగు న్నర టిక్కెట్లు - జనతాయే అనుకో—'

సత్యవతమ్మ కాస్త ఆలోచించి 'ఇది పెళ్ళిళ్ళ కాలమే. నాలుగు చోట్ల నాలుగు పెళ్ళిళ్ళయినా బాగణ్ణు!' అన్నది.

'నాలుగు పెళ్ళిళ్ళేం నాలుగువేల పెళ్ళిళ్ళవుతాయి. మనని పిలిచేవాళ్ళుండొద్దూ? అయినా పెళ్ళిళ్ళు కూడా సినిమాలల్లే అయాయి. సినిమా అంతగా బాగుండదని అనుమానంవేస్తే పత్రికల వాళ్ళకి ఒకవారం నడిచాక చూపిస్తారుట. అట్లాగే పెళ్ళిళ్ళ ఖర్చు

భరించలేనివాళ్ళు, లాంఛనంగా ఆహ్వానించే వాళ్ళకి పెళ్ళయిన మర్నాడందేట్టు శుభలేఖలు పోస్టు చేస్తారుట!' అంటూ వెం. మాటల తడికి అల్లసాగాడు. అది అతని హాబీ.

'ఇప్పుడు మనంవున్న స్థితిలో శుభ లేఖంటూ అందాలేగాని పెళ్ళయిన మూడోనాడన్నా వెళతాంగాని ఊరకుంటామా?' అన్నది స.

'ఏం లాభం? సినిమా ప్రెస్‌షో అయినాక తిరిగి వెళ్ళిపోయే కార్ల బారును చూడటానికి వెళ్ళినట్టుగా ఉంటుంది... ప్రెస్‌షో అంటే జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు పట్నంలో పెళ్ళి ఇన్విటేషన్లు నాటకాల కాంప్లిమెంటరీ టిక్కెట్లల్లే ఉంటున్నాయి తెలుసా?'

'దాల్లే ఊరుకోండి. మీదంతా—'

'—ఇన్విటేషన్ వెంట రిసెప్షన్‌కు ఒక బుల్లికార్డూ, డిన్నరుకు యింకో బుల్లికార్డూ ఉంటుంది. డిన్నరు కార్డుమీద ఎడ్మిట్ వన్ అని కూడా ఉంటుంది. కొందరికి ఉత్త ఇన్విటేషన్లే వెళతాయి. కొందరికి రిసెప్షన్ కార్డు కూడా ఉంటుంది. మరీ అదృష్టవంతులకు డిన్నరు కార్డుకూడా వుంటుంది. ఎడ్మిట్ వన్. ఆ కార్డు చూపించందే భోజనాల చోటుకు రానివ్వరనుకుంటా!'

సత్యవతమ్మ నవ్వుతూనే, 'ఇహ చాలించండి!' అని భర్తను ప్రోత్సహించింది.

'ఈ సిమిలారిటీ - అంటే పెళ్ళిళ్ళకి సినిమాలకి పోలిక-యెంత బాగా స్థిరపడి పోయిందంటే కొన్ని నాటకాల కాంప్లిమెంటరీ టిక్కెట్లు పెళ్ళి శుభలేఖల్లాగా ఉంటాయి! శ్రీమతి అండ్ శ్రీ వై. వెంకటనారాయణా ఇన్‌వైట్ యూ టు ఏ పబ్లిక్ షో ఆఫ్ దేర్ మెయిడెన్ ప్రొడక్షన్—'

సత్యవతమ్మ ఆగమని భర్తకి సంజ్ఞచేసి, 'వాసూ, వాసూ! పోస్టు వచ్చినట్టుంది తీసుకోరా!' అని పెద్దకొడుక్కు కేకపెట్టింది.

'ఏమిటంటున్నానూ?' అన్నాడు వెం.

'ఎక్కడికి పోవాలో తేల్చకుండా ఉండటానికి ఏమైనా అంటున్నారు.'

'ఆన్ ది కాంట్రరీ! మనం యీ శలవులు నెల్రోజులూ యే విధంగా దుర్వినియోగపరచాలా అన్న సంగతి గురించి తప్ప నేను మరోవిషయమే ఆలోచించటంలేదు. వెధవ పోస్టుమన్ వచ్చి నా త్రెడ్ బ్రేక్ చేసేశాడు!'

వాసు పోస్టు చంకనుపెట్టుకుని ఒక శుభలేఖలాటిది చదువుతూ వచ్చాడు.

'ఏమిట్రా అదీ!' అన్నది సత్యవతమ్మ ఆత్రంగా.

'శుభలేఖ' అన్నాడు వా.

'అది తెలుస్తూనేవుంది. పెళ్ళా, ఒడుగా, గృహప్రవేశమా? ఎవరికి, ఎప్పుడూ, ఏ వూర్నుంచీ?' అన్నది స.

'మీకక్కాదులేమ్మా! నాకు—పర్సనల్—నా క్లాస్ మేట్ లే' అంటూ యింకా ఆ శుభలేఖనే చదువుతున్నాడు వా.

'ఏమిటదీ?' అంటూ సత్యవతమ్మ కొడుకు చేతిలోవున్న శుభలేఖ వొడిసి లాక్కుని పైనా కిందా చూసింది, తెలిసిన పేరేమన్నా కనిపిస్తుందేమోనని.

'ఈ రిటైర్డు హెడ్మాస్టరెవరండీ? పి. యల్. నరసింహాంట!'

'నాకు తెలీదు. ఆయన పెళ్ళా ఏమిటి?' అన్నాడు వెం.

'చాల్లెండి. వేళాకోళమంటే యింక అదేపనా?'

'మా స్నేహితుడి తండ్రిలేమ్మా!' అంటూ వాసు తల్లిచేతి లోంచి శుభలేఖ లాక్కోబోయాడు. కాని ఆ క్షణంలోనే వెంకట నారాయణ ఆ పని చేసేశాడు. ఆయన శుభలేఖ పరిశీలించి, 'ఓరి నీ దుంప తెగా!' అన్నాడు.

'ఎవరిని దీవిస్తున్నారు? పెళ్ళికొడుకునా? తండ్రినా?' అన్నది స.

'పెళ్ళికూతురు తండ్రిని! వాడెవడో తెలుసా? నా చిన్ననాటి స్నేహితుడు. పురుషోత్తంగాడు. పట్నంలో చేరి అక్కడ చేతులుమార్చి డబ్బు లక్షలు వోడుసుకున్నాడు. వాడి చేతులకి డబ్బు బంక ఉందని ఏడిపిస్తాం! పెళ్ళి వాడింటోనె ఎగ్మూరులో ... చూశావా. దొంగ వెధవ! వాడి శుభలేఖ రానేలేదు. పెళ్ళికొడుకు తరపు శుభలేఖ వచ్చింది!'

'ఇది బాగానేవుంది. దూరం వెళ్ళినట్టుంటుంది. పెళ్ళి కలి సొస్తుంది. మనం మగపెళ్ళివారి తరఫున వెళదాం!' అన్నది స.

'నాకొచ్చింది శుభలేఖ. మిమ్మల్నందర్నీ యెవరు పిలిచారు. మీరు రావటానికి వీల్లేదు' అన్నాడు వాసు. వాడికి ఇరవైఏళ్ళు. బీయస్సీ పరీక్షకు కూచున్నాడు. అన్నిట్లోనూ 60 కి పైనవస్తే ఫస్టు క్లాసులో పాసవుతాడు. 35 కు తక్కువొస్తే తప్పుతాడు అదీ పరిస్థితి.

కాని వాసు తన వయసునుబట్టి యిప్పుడిప్పుడు తన వ్యక్తిత్వాన్ని గట్టిగా నిలబెట్టుకుంటున్నాడు. ఎంతచెడ్డా - చెడటం ప్రసక్తి లేదనే అనుకోండి! — తల్లిగనక సత్యవతమ్మ తనకొడుకు వ్యక్తిత్వం ప్రదర్శించి నప్పుడల్లా 'ఔరా పిడుగా!' అని లోపల అను కుని, పైకి వాణ్ణి ఉడికించే మాటలని వాడు ఉడుక్కుంటే చూచి ఆనందిస్తుంది.

'అదేమిట్రా? నీకు ఆహ్వానం వస్తే అది మాకుకాదూ? అందులో విత్ ఫామిలీ అండ్ ఫ్రండ్స్ అని లేదూ?' అని అడిగిం దావిడ.

'ఇంకా నయం! విత్ మదర్, ఫాదర్, బ్రదర్స్ అండ్ సిస్టర్స్ అని లేదాఅని అడగలేదు! చూడు కావలిస్తే. ఇది నా ఒక్కడికే!' అన్నాడు వాసు.

'ఇప్పుడు ఫామిలీ అండ్ ఫ్రండ్స్ అని రాయటం మానేశారు. అట్లా రాశారో పెళ్ళివాళ్ళు దివాలాయెత్తి ఐపీ పెట్టాల్సిందే!' అన్నాడు వెం.

'అదేమిటండీ చోద్యం! ఇన్విటేషన్ అందుకున్నవాళ్ళు మాత్రమే వెళతారూ?'

'సకుటుంబంగా మనం రావాలనుకుంటే వెంకట్నారాయణ అండ్ కో అనో, అండ్ ఫామిలీ అనో రాస్తారు. ఫ్రెండ్స్ ప్రసక్తి లేదు' అంటూ కల్పన చేశాడు వెం.

'లేకపోతే మానె. మనం వాసుతోబాటు యీ పెళ్ళికి తప్పక వెళదాం. పట్నంచూసినట్టూ అవుతుంది' అన్నది స.

'నా వెంట మీరొద్దు. కావలిస్తే మీరు వేరే రండి. అంతే చూడమ్మా. మీరంతా యిట్లా నా వెంటపడి వచ్చారంటే నన్నెవరూ పిలవరు. తరవాత మీ యిష్టం. చెబుతున్నా' అన్నాడు వా.

వెంకటనారాయణ ఆలోచించటం మాని తన సుపుత్రుడు యీ దేరే స్టయిలు గమనించసాగాడు.

'అంత పెడసరం కూడదురోయ్. ఇప్పుడు మానుంచి వేర్లుపడి పోతున్నావే. రేపు పెళ్ళయితే నువు మాతో మట్లాడతావాని! అదివర కల్లా మాకు పిలుపు లొచ్చిన చోటికల్లా నిన్ను తీసుకు పోలేదూ? నెల్రోజుల సెలవు యెట్లా ఖర్చు చెయ్యాలా అని మథనపడు

తుంటిమిగదా, ఒక్కసారి నీ వెంట తీసుకుపోరా అంటే ససేమిరా అంటావా?' అంటూ సత్యవతమ్మ కొడుకుతో అడుకుంది.

వాసు సీరియస్‌గా మొహంపెట్టి 'నే నొకవేళ తీసుకుపోతే మాత్రం నాన్న కెంత నామర్దా! పెళ్ళికూతురు తండ్రి స్నేహితుడై వుండికూడా పిలవలేదుగామాలని అందరూ అనుకోరూ?' అంటూ చంకలోవున్న పోస్టు తండ్రి చేతికిచ్చాడు.

వెంకటనారాయణ ఉత్తరాలన్నీ పైపైనచూస్తూ 'అఘోరించినట్టే వుంది. ఇదిగో పురుషోత్తంగాడి ఉత్తరం!' అంటూ మిగిలినవి పక్కన పెట్టి ఆ కవరు చించి ఉత్తరం తీసి పైకి చదివాడు.

'మై డియర్ వెంకట్! మా అమ్మాయి పెళ్ళి యింకా పది రోజు లుంది. ఇన్విటేషన్లు ఒక డజను పంపిస్తాను మన పాతస్నేహితుల కందరికీ యియ్యి. ఎవరెవరు ఎక్కడుంటున్నదీ బొత్తిగా తెలియటంలేదు. ఏనాడికోసారన్నా ఎవరూ ఉత్తరంముక్క రాసిన పాపాన పోరు. (ఒకవేళ వాళ్ళు రాసినా నేను జవాబు రాయను. టైములేదు) అందుచేత నేంచేస్తావంటే, ఇది మీ యింట్లో పెళ్ళే అనుకుని సాధ్యమైనంతమంది పాత స్నేహితుల్ని మళ్ళేసుకురా. తా. కా. మన అవకాయగాడు ఉరఫ్ ప్రకాశం) ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు? వాణ్ణీ వండిమంత్రి సామంతాది బలగాన్ని కొట్టుకురా. ఇప్పుడు కలుసుకోకపోతే పాతస్నేహితుల్ని మరి పదేళ్ళదాకా కలుసుకోవటం పడదు—ఉత్తమ పురుషః పురుషోత్తమః'

'అయిందిగద అబ్బాయిగారి పెళ్ళి! మేమూ పోతున్నాం ఇంతోటిపెళ్ళికి! మె మెక్కినరైల్లో యెక్కకు, తెలిసిందా?' అన్నది సత్యవతమ్మ కొడుకుతో మళ్ళీ ఆట ప్రారంభిస్తూ.

'నాయిష్టం! నాయిష్టమొచ్చిన రైల్లో యెక్కుతాను. రైలు మీదా?' అన్నాడు వాసు. అందర్నీ తన పూచీమీద తీసుకువెళ్ళే ప్రమాదం తప్పినందుకు సంతోషిస్తూ.

